## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్థం TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ లో eBOOK(PDF) అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(www.google.co.in), మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇంట్లో ఆధ్యాత్మిక గ్రంధాలయం ఉండాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వెబ్ సైట్: http://ebooks.tirumala.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సాయి రామ్ సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

**గమనిక:** భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# భారతంలో

# నీతి కథలు



ఉషశ్రీ



ప్రచురణ:
తిరుమల తిరుపతి దేవస్థానములు

# భారతంలో నీతికథలు

రచయిత

ఉషశ్రీ




ప్రచురణ
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి
2008

BHARATHAMLO NEETHIKATHALU
(Moral Stories from Mahabharata)

By
Ushasri



T.T.D. Religious Publications Series No.354

Re - Prints : 1999, 2003, 2005, 2006, 2008

Copies : 5000

Published by :
**Sri K.V. RAMANACHARY**, IAS
Executive Officer,
T.T. Devasthanams,
Tirupati - 517 507.

Printed at :
**Gayathri Art Printers**
Hyderabad.
Ph : 2767 0210

# ముందుమాట

భారత రామాయణాలు భారతజాతికి ప్రాణాలవంటివి. అందులోని కథలను అంతో ఇంతో ఎఱుఁగని భారతీయుడుండడు. 'మహత్త్వాత్ భారవత్త్వాచ్చ మహాభారతముచ్యతే' అని పెద్దల మాట. అంటే మహాభారతం మహత్త్వమూ, అర్థగౌరవమూ, కల మహోత్తమగ్రంథ మన్నమాట! ''యదిహాస్తి త దన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్'' అనే నుడి పరమ సత్యం. అనగా ఇందులో లేని విషయం ఎందులో లేదనీ, ఇతర గ్రంథాల్లో లేని విషయాలు ఎన్నో ఈ జయేతిహాసంలో వున్నవనీ సారాంశం.

వ్యాసభగవానుడు మహాభారతాన్ని సంస్కృతంలో వ్రాశాడు. సంస్కృతం తెలియనివారికి అది అందుబాటులో లేకపోవడంవల్ల తరువాత ఎంతో కాలానికి కవిత్రయంవారు దీనిని తెనిగించి తెలుగు జాతికి మహోపకారం చేశారు. ఆ అనువాదం పండితులకు మాత్రమే అర్థమయ్యే రీతిలో నెలకొని వున్నది. ఆ కారణంగా కవిత్రయ భారతంలోని సారం సుకరంగా ఆస్వాదించే అవకాశం అందరికీ అందుబాటులో లేదు.

కనుక విద్యాభ్యాసం చేసే బాలబాలికలకు, యువతరానికి భారతంలోని నీతులు, ధర్మాలు, ఇంకా పలు విషయాలు అందించడానికి అనువుగా సరళమైన భాషలో ''భారతంలోని నీతికథలు'' అనే ఈ చిరుపుస్తకం 'ఉషశ్రీ' గారిచే రచింపబడింది. బాల్యంలో నేర్చిన విద్యలు, అలవరచుకొన్న అలవాట్లు మానవుణ్ణి అలాగే అంటిపెట్టుకొని వుంటాయి అనడం నిజం.

ఈ నాటి బాలబాలికలు, యువకులు భావిభారత పౌరులు గనుక ఈ పుస్తకం వీరిని సత్యసంధులుగా, ధర్మపరాయణులుగా, సన్మార్గవర్తనులుగా తీర్చిదిద్దగలదనడం నిస్సందేహం.

ఇందులో ఇంచుమించు ఇరువది నీతికథలు చోటుచేసికొన్నాయి. ఈ కథలన్నీ - ఒక్క 'అన్నదాన మహిమ' తప్ప - భారతంలోని తొలి ఐదు పర్వాలనుండి ఎంపిక చేయబడ్డాయి. 'కణిక నీతి' వంటి ఒకటి రెండు కథాంశాలు సంస్కృతమూలంనుండి స్వీకరింపబడినాయి.

ఈ పుస్తకంయొక్క పూర్వముద్రణ ప్రతులు చెల్లిపోయినందున పాఠకుల ఉపయోగార్థమై పునర్ముద్రిస్తున్నాము. ఇలాగే, భారంలోని తరువాతి పర్వాలనుండి కూడా చక్కని నీతికథల్ని ముచ్చటగా సమకూర్చి ప్రచురించే ప్రయత్నం కొనసాగుతున్నది.

తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఆర్షధర్మ ప్రచారం నిమిత్తం చేపట్టిన బహుముఖ కార్యక్రమాల్లో ధార్మిక గ్రంథ ప్రచురణ విశిష్టమైంది. ఈ పుస్తక ముద్రణ -- ఎప్పటిలాగే -- సహృదయామోదాన్ని పడయగలదని మా ఆకాంక్ష

**కార్యనిర్వహణాధికారి**

తి.తి.దేవస్థానములు, తిరుపతి

# విషయ సూచిక

# జ్ఞాన దీపాలు



భారత రామాయణాలను గురించి ఇటీవల చాలా మీమాంసలు రేగుతున్నాయి. అవి జరిగాయా? కట్టుకథలా? అని కొందరు ... వీటి నిండా అసందర్భాలు ఉన్నాయని మరికొందరు .... ఎవరి బుద్ధికి అను కూలంగా వారు వాదిస్తున్నారు. ఈ వాదాలతో నిమిత్తం లేకుండా మాన వాళికి మాతామహ, పితామహులయిన వ్యాస వాల్మీకు లందించిన ఆ నిధులను ప్రత్యేకుని అనుభవించేవారు అసంఖ్యాకులు. వారందరికీ జ్ఞాన నేత్రాలు భారత రామాయణాలు.

ఈ జ్ఞాననేత్రాలకు అంజనప్రాయం వాటిలోని ఉపాఖ్యానాలు. భారత - రామాయణాల పరమార్థం -

భా ర తం అనేమాట వినిపించేసరికి -
ఏమున్నది భారతంలో?
కృష్ణనామ సంకీర్తనం ....
ధర్మశాస్త్ర ప్రబోధం ....
కురుక్షేత్ర యుద్ధం ....
యుద్ధరంగంలో గీతాబోధ ....

అనేవారు కొందరు.

దేశంలో చదువురాని వారు ఎక్కువ ఉండటం వల్ల వారందరికీ ఇది పురాణ కాలక్షేపంగా, తోలుబొమ్మలాటగా పనికివచ్చి పల్లెమందుల కాతికి తోలపాడింది - అని కొందరు మేధావులు ప్రచారం చేశారు.

అక్షరాస్యత అంటే నాలుగు అక్షరాలు వ్రాయడం, నాలుగు పంక్తులు చదవడం, పది లెక్కలు చేయడం అని ఇంగ్లీషువారు బోధించడంతో అదే విద్యావిధానం అయింది. దానితో ఆవుకి నాలుగు కాళ్ళు ఉండును.

అది పాలు యిచ్చును. అవి తెల్లగా ఉండును. అరటిచెట్టు ఆకులు వేయును, అనే పాఠాలు చదవడానికి ప్రాథమికదశ అంతా వ్యర్థం అవు తోంది, పదేళ్లు వచ్చేవరకూ.

మనిషికి ధారణాశక్తి ఉండే పదేళ్ళూ, తల వల పలక, బలపం పాఠాలే శరణ్యం అయి అది మొద్దు బారి పోతున్నది.

అలాకాకుండా విద్యకు ప్రధాన లక్ష్యం చిత్తసంస్కారం, మనో వికాసం అని భావించిన ఈ జాతి భారత రామాయణ కథా ప్రవచనంతో బాల్యదశనుండీ ఉత్తమ జీవన విధానాన్ని బోధించేది.

ఆబాలగోపాలం చెవు లప్పగించి విసే కథలు ఆధారం చేసుకుని ఆ కథలనే పంచదార పాకంతో ఉత్తమ జీవన సంస్కారం ఔషధప్రాయంగా అందించే భారత రామాయణ గాథలు వింటూ విద్యాగంధం అందుకున్నది ఈ జాతి.

అందుకొన్నంత కాలం ఈ జాతిలో రావణ, దుర్యోధనుల వంటి పాశవిక బుద్ధుల పట్ల అసహ్యం పెరిగి వారిని సమాజంలో దుష్టగణంగా దూరంగానే ఉంచేవారు.

రాముడు, ధర్మరాజు వంటి ఆదర్శ పురుషులకు గురుపీఠం ఉండేది.

రామాయణంలో రాముడు దేవుడని కానీ, భారతంలో ధర్మరాజు పరమేశ్వరుడని కానీ, బోధించలేదు. సత్య వాక్పాలనతో దుష్టశిక్షణకు నడుం కట్టిన పూర్ణ పురుషుడు శ్రీరాముడు.

అలానే ధర్మప్రబోధంలో సర్వ పాశవిక శక్తులనూ అణచడానికి ధర్మరాజాదులకు సన్నద్ధం చేసినవాడు కృష్ణుడు.

సత్యం ధర్మం ఈ రెండే విశ్వమానవాళికి శాంతిమార్గ సాధనా లనీ, అవే ప్రశాంత జీవన పదాలనీ బోధించాయి భారత, రామాయ ణాలు.

ఈ విషయాన్ని విస్మరించి అవన్నీ ముసలమ్మల ఊసుపోక కథ లనీ, వాటి నిండా జాతిని నిర్వీర్యం చేసే నల్లమందు సందేశా లున్నా యనీ అనేవారు, కట్టుకథలూ, పిట్టకథలూ విని అపోహ పడ్డవారే అవక

తప్పదు. అటు భారతం కాని, ఇటు రామాయణం గాని, మూలం చది విన ఎవరికైనా వాటి పరమార్థం మానవ జీవితానికి శాంతినీ, మనస్సుకు వికాసాన్నీ, ఇచ్చేవే అని బోధపడక పోదు.

అయితే వాటిలో ఆ కాలానికి, సమాజానికి సంబంధించిన అద్భుత సన్నివేశాలు ఒకటి, రెండు ఉండవచ్చు. ఆ రెండు మూడు సన్నివేశా లనే గ్రహించేవారు అటుకులు వదిలి పొల్లుబొక్కువారే.

పొల్లుతూమనుకుని అటుకులు నమిలితే తీపి దొరుకుతుంది.

ఆ తీపిని అందుకో దలచినవారు యిప్పటికీ లక్షలు ఉన్నారు. జాతిలో అటువంటివారి సరసన నిలువదలిచిన వారికి వారి వారి భాషలలో వారి వారి స్థాయి ననుసరించి ఎప్పటి కప్పుడు ఈ భారత రామాయణా లను పద్యరూపంలో, వచనరూపంలో కవులూ, రచయితలు, అందిస్తూనే ఉన్నారు. వాటిని చదివి లక్షలాది యువకులు తృప్తి పడుతూనూ ఉన్నారు.

ఆ దృష్టితోనే ఈ తరం యువజనానికి అందుబాటులో ఉండేలా, వారి ఆసక్తికి అనుగుణంగా భారత, రామాయణాలు రెండూ తెలుగులో వ్యావహారిక వచనంలో అందించాను ప్రస్తుతం—

పునాది లేనిదే మేడ నిలబడదు.

భూమి లోతులకు వేరు చొచ్చుకుపోని వృక్షం చిరకాలం పెరగదు.

అలానే జాతి నిక్షేపాలను విడిచిపెడితే దొరికేది పై పై పూత బంగారమే.

గనిలో దిగి బంగారం తీసుకుని దాన్ని శుద్ధి చేసుకుని కరిగించి మళ్ళీ మనకు కావలసిన ఆభరణంగా రూపొందించుకోవాలి.

అలా రూపొందినవే పది కాలాలు మిగులుతాయి.

వాటిని తయారుచేసే జ్ఞాన దీపాలే భారత రామాయణాలు.

[భారతం అనగానే అది మనం మొయ్యలేనంత పుస్తకం అని కొందరి భయం. దాని నిండా వర్ణాశ్రమ ధర్మప్రచారం ఉంటుందని మరికొందరి ప్రచారం. ఈ కాలానికి ఎందుకూ కొరగాని పురాణగాథ అని విసుగు ప్రదర్శించేవారు ఇంకొందరు.

వీరందరూ కూడా భారతం చదవకుండానే ఇటువంటి ప్రచారానికి సాహసించారు అని ఆ ఇతిహాసాన్ని చదివినవారు అనేమాట. ఈ వాద ప్రతివాదాలతో నిమిత్తం లేకుండా అయిదేళ్ళు దాటి పదహారో ఏడు రాని వారందరికీ ఆసక్తి కలిగించే నీతిబోధ చేసే చిన్న కథలు కో కొల్లలుగా ఉన్నాయి భారతంలో. అవి అందివ్వడానికే ఈ ప్రయత్నం. ఇవి చదువుతూంటే ఇలాంటి కథలు భారతంలో ఉన్నాయా! నీతిచంద్రికలో ఉంటాయనుకున్నాం అనిపిస్తుంది.

అందుకే భారతంలో లేనిది ఎక్కడా లేదు, ఎక్కడ లేనిదయినా భారతంలో ఉంది అంటారు. చదవండి.]

## కలికపీతితో కార్యాలు సాధించాలి

( ఈ కథ ఆదిపర్వం లోనిది )

హస్తినాపురాన్ని పాలించే ధృతరాష్ట్ర మహారాజుకు ముగ్గురు మంత్రులున్నారు.

అందులో ప్రధాని విదురుడు. ఈ విదురుడు విద్వాంసుడు, ధర్మ పరుడు, నీతికోవిదుడు.

రెండవవాడు సంజయుడు. ఈయన రాయబార కార్యాలు నిర్వ హిస్తూ, నిరంతరం ధృతరాష్ట్రుని అంతరంగిక సలహాదారుగా ఉంటాడు.

మూడవ వాడు కణికుడు. ఈ కణికుడు కూటనీతి కుశలుడు. అంటే మోసంతో కుట్రలతో శత్రువులను ఎలా నాశనం చేయాలో చెప్పగలడు. అటువంటి కుటిల నీతిపరుడైన కణికుడు తన మహారాజుకి చెప్పిన కథ మీరు చదవబోతున్నారు.

మహారాజా !

అనగా అనగా ఓ మహారణ్యం.

ఆ అడవిలో ఎన్నో క్రూరమృగాలు, యథేచ్ఛగా విహరిస్తు న్నాయి.

అక్కడ ఓ నక్క ఉంది.

అది చాలా తెలివైనది.

తన పనులన్నీ ఇతరులచేత చేయించుకుని, పని పూర్తికాగానే వాటిని మోసంచేసి హాయిగా ఆ ఫలాన్ని అనుభవిస్తూండేది.

ఈ నక్కకి నలుగురు స్నేహితులున్నారు. పులి, తోడేలు, ముంగిస, ఎలుక. వీటితో కలిసి మెలిసి ఉన్నట్టు నటిస్తూ సుఖంగా జీవి స్తున్నది.

ఆరోజులలో ఒకనాడు —

పిక్కబలిసి నవనవలాడుతూ హాయిగా గంతులేస్తూ, చెంగుచెంగున దూకుతూ పోయే లేడి దాని కంటబడింది. ఆ లేడి ఈ మిత్రబృందాన్ని దూరంనుంచి చూసింది. చూస్తూనే వాటికి బహుదూరంగా పారిపోయింది. దాన్ని తినాలని నక్కకు కోరిక కలిగింది. ఎంత ప్రయత్నించినా, దాన్ని పట్టడం సాధ్యం కావడంలేదు.

బాగా ఆలోచించింది నక్క.

మిత్రులను చుట్టూ కూర్చొ బెట్టుకుని:

"స్నేహితులారా! ఈ లేడి ఎంత అందంగా ఉందో, దాని మాంసం అంత రుచిగా ఉంటుంది అయితే దానితో పరుగెత్తే శక్తి మనకెవరికీ లేదు. కనుక దాన్ని చంపడం మనకు సాధ్యంకాదు. ఇప్పుడు మనం ఒక కుట్రపన్ని దాన్ని చంపాలి. అప్పుడు హాయిగా దాని మాంసం మనం అరగించవచ్చు" అని నాలుక చప్పరించి, అది ఎంతరుచిగా ఉంటుందో చూపించింది.

అన్నిటికీ నోరూరింది.

"ఆ ఉపాయం నువ్వే చెప్పాలి నేస్తం" అన్నాయి అవి ఆతురతతో అదేచూస్తూ.

అది కొంతసేపు ఆలోచన అభినయించింది.

"ఆ! ఇప్పుడు ఆలోచన వచ్చింది."

"జాగ్రత్తగా విని మీ అభిప్రాయం చెప్పండి. ఈ లేడి మెలకువగా తిరుగుతుండగా మనం పట్టుకోలేం. అందుచేత ఇది అలిసిపోయి సుఖంగా నిద్రపోయే సమయం కనిపెట్టాలి. అప్పుడు చప్పుడు కాకుండా పాకుతూపోయే ఈ ఎలకబావ దాని కాళ్ళు కొరికి పారేయాలి. అదే అదనులో పులి వెళ్ళి దాని మెడ విరిచివేయాలి. అంతే! అంది.

దాని తెలివికి అవి ఎంతో ఆనందించాయి. ఆ లేడి నిద్రపోయే సమయం కోసం ఎదురుచూశాయి.

అడవిలో గడ్డి ఏపుగా పెరిగిన ప్రాంతాలలో చెంగు చెంగున గంతులేస్తూ, పచ్చికమేసి, సెలయేటి ఒడ్డున నీరు త్రాగి, బాగా అలిసి విశ్రాంతిగా కాళ్ళుజాపి నిద్రపోతున్నది లేడి.

నక్క సలహా ప్రకారం అలికిడి కాకుండా ఎలకవెళ్ళి దాని కాలు కటుక్కున కొరికింది. బాధతో అది లేవబోతూండగా పులి తన పంజాతో దాని వెన్నుమీద కొట్టి మెడ కొరికేసింది.

నక్కతోపాటు దాని స్నేహితులు నలుగురూ సంతోషంతో లేడి చుట్టూ కూర్చున్నాయి.

అప్పుడా నక్క:

"స్నేహితులారా! ఇంత రుచిగల మాంసం మనందరం హాయిగా తినాలి. ఇప్పుడు మీ శరీరాలన్నీ దుమ్మూ ధూళితో ఉన్నాయి. అందు చేత ఆ కొండలోయలో సెలయేటికి పోయి స్నానం చేసి రండి. అప్పుడు తినవచ్చు" అంది.

అవి నాలుగూ సంతోషంతో స్నానానికి వెళ్ళాయి.

అందులో అందరికంటే ముందుగా వరుగు వరుగున వచ్చింది పులి, ఆ లేడి మాంసం తినాలని.

నక్క బొటబొటా కన్నీరు కారుస్తూంటే చూసిన పులి:

"బావా! ఎందుకు విచారిస్తున్నావు? అంది.

"ఏం చెప్పను పులిబావా! ఆ ఎలక లేదూ! అది ఏమన్నదో తెలుసా! 'పులి ఎంత పెద్ద జంతువైతే ఏం లాభం. నేను కాళ్ళు కొరికితే గాని అది ఏమీ చేయలేకపోయింది. నా తెలివితో చచ్చిన లేడిని తినడానికి వస్తుంది సిగ్గులేకుండా,' అని హేళాకోళం చేస్తే నాకు బాధ కలిగింది, అంటూ నక్క కన్నీరు విడిచింది.

పులికి పౌరుషం వచ్చింది.

"మిత్రమా! ఎలక నా కళ్ళు తెరిపించింది. ఈ రోజు మొదలు నా శక్తితో నా తిండి సంపాదించుకుంటాను. ఒకరిమీద ఆధారపడను." అంటూ వెళ్ళిపోయింది.

అంతలో ఎలక రాగా –

"విన్నావా, ఎలకబావా! ఈ లేడిని పులి ముట్టుకుంది కనక ఇది విషపూరితం అయింది. దీన్ని నేను తినను. నా ఆకలి తీరడానికి ఎలకను తినేస్తా అంటూ ముంగిస బయలుదేరింది. అనగా ఎలుక చటుక్కున కన్నంలోకి పారిపోయింది.

మరికొంతసేపటికి తోడేలు వచ్చింది. "విన్నావా! పులిబావకు నీ మీద కోపంవచ్చి, నిన్ను తినేస్తానంటూ బయలుదేరింది. దాని భార్యతో కలిసి నిన్ను తింటుందట", అనడంతో తోడేలు దౌడు తీసింది.

అప్పుడు ముంగిస రాగా, చాలా ఆశగా వచ్చావు. వాళ్ళు ముగ్గుర్నీ చంపి దూరంగా పారేశాను. నీకు బలంఉంటే నన్ను ఓడించి ఈ లేడి మాంసం తిను" అనగా అది తోక ముడిచి పారిపోయింది.

హాయిగా ఆ లేడిమాంసం ఆరగించింది నక్క.

విన్నారా! మహారాజా! తెలివితో వంచనతో మనకార్యాలు చక్క బెట్టుకోవాలి అన్నాడు కణికుడు. ఇదే కణిక నీతి.

---

# విద్య గురుముఖతః నేర్చుకోవాలి

(ఈ కథ అరణ్యపర్వంలో ఉంది)

పూర్వం భరద్వాజుడని మహర్షి ఉండేవాడు. ఆయనకు ప్రాణస్నేహితుడు రైభ్యుడు. వారిరువురూ, సూర్యోదయానికి ముందుగానే లేచి కాలకృత్యాలు ముగించి, నదీస్నానంచేసి, నిర్మలచిత్తంతో పరబ్రహ్మధ్యానం చేసుకుంటూ అడవిలో దొరికే ఫలాలతో జీవయాత్ర సాగించేవారు. అలా ఉండగా వారిలో భరద్వాజునికి యవక్రీతుడనే కుమారుడు కలిగాడు.

రైభ్యునికి అర్వావసువు, పరావసువు అని యిద్దరు కుమారులు పుట్టారు. వారు పెరిగి పెద్దవా రయ్యారు.

భరద్వాజుడు ఎప్పుడూ ధ్యానసమాధిలో ఉండి కుమారుని విద్యా విషయాలు పట్టించుకోలేదు.

రైభ్యుడు తన కుమారు లిద్దరినీ విద్వాంసులుగా తీర్చి దిద్దుకున్నాడు.

వారుభయులూ వివిధప్రాంతాలలో పర్యటించి తమ విద్యతో అందరి ప్రశంసలూ పొందుతున్నారు.

ఇదిచూసిన యవక్రీతునికి విచారం కలిగి వారివలె తానుకూడా విద్యావంతుడై విశేషఖ్యాతి సంపాదించాలనుకున్నాడు.

అదే ఊహతో తపస్సు ప్రారంభించాడు. యవక్రీతుని తీవ్రనిష్ఠను గ్రహించి దేవేంద్రుడు వచ్చి :

"స్వామీ! విద్య అనేది గురుముఖతః అధ్యయనం చెయ్యక తప్పదు. అప్పుడుకాని వేద వేదాంగ విజ్ఞానంతో మనస్సు పరిపక్వం కాదు. ఈ ప్రయత్నంమాని ఉత్తమగురువును ఆశ్రయించు" అన్నాడు. ఆ మాట యవక్రీతునికి నచ్చలేదు. తపస్సు చేస్తూనే ఉన్నాడు. ఉచిత రీతిని వీనికి ఉపదేశించాలని ఇంద్రుడు ముసలి బ్రాహ్మణవేషంలో వచ్చి గుప్పెడితో యిసక తీసి నదిలో పోస్తున్నాడు. యవక్రీతుడు నదీస్నానానికి వచ్చి ఏమిటిపని? ఎందుకు చేస్తున్నావు? అని అడిగాడు. వృద్ధుడు నవ్వుతూ :

"ఈ నదికి అడ్డంగా గోడ కడుతున్నాను" అన్నాడు.

యవక్రీతుడు నవ్వి:

"ఇంతటి నదికి గుప్పెడు గుప్పెడు ఇసుకతో గోడకట్టటం యీ జీవితంలో సాధ్యమా!" అన్నాడు.

అప్పుడావృద్ధుడు –

"నాయనా! గురుశుశ్రూషలేకుండా వేదవిద్య అంతా నేర్చుకోవాలనుకోవడం కంటె నేను చేసేది అవివేకంకాదు."

అని జవాబిచ్చాడు.

"ఓహో సురపతీ! మీరు ఎలా అయినాసరే నాకు వేదవిద్య అనుగ్రహించి విశేషఖ్యాతి కలిగించాలి" అని ప్రార్థించాడు.

ఎన్ని చెప్పినా ప్రయోజనంలేదని ఇంద్రుడు అనుగ్రహించాడు.

యవక్రీతుడు సర్వవేదశాస్త్ర విద్యా విదుడయ్యాడు. మరుక్షణంలో తపోదీక్షవిడిచి తండ్రిదగ్గరకు వచ్చి జరిగిన విషయాలన్నీ వివరించాడు.

అప్పుడు భరద్వాజుడు! "నాయనా! ఈ విధంగా విద్యసాధించడం వల్ల అది అహంకారం కలిగిస్తుంది. అహంకారం ఆత్మనాశనకారణం, నాయనా!

ఇంత చిన్నవయస్సులో తీవ్రతపస్సుచేసి వరాలు పొందడం మరింత అహంకార హేతు వవుతుంది. అయినా ఒక మాట విను.

నువ్వు ఎప్పుడూ రైభ్యుని ఆశ్రమ పరిసరాలకు వెళ్ళకు. ఆయన కుమారులతో వైరం తెచ్చుకోకు అన్నాడు. యవక్రీతుడు వివిధ ప్రదేశాలు పర్యటించాడు. అలా ఉండగా ఒకనాడు – అది వసంతమాసం. అరణ్యమంతా పూలవాసనలతో, ప్రకృతి అంతా పరమరమణీయంగా, ఉల్లాసకరంగా ఉంది.

అటువంటి సమయంలో యవక్రీతుడు రైభ్యుని ఆశ్రమప్రాంతానికి వచ్చాడు. ఆశ్రమంలో ఆ మహర్షి కోడలు ఒంటరిగా కనుపించింది. యవక్రీతుని మనసు చెదిరింది. ఇంద్రియాలు వశం తప్పిపోగా ఆ యిల్లాలిని బలాత్కరించి భోగించి వెళ్ళిపోయాడు.

ఆశ్రమానికి వచ్చిన మహాముని ఆ కథవిని తీవ్రక్రోధంతో తన శిరస్సు నుండి రెండు జటలుతీసి హోమంచేసి ఒక సుందరాంగినీ, ఒక రాక్షసునీ సృష్టించాడు. వారిద్దరూ మహర్షి ఆదేశం ప్రకారం యవక్రీతుని సమీపించారు.

ఆ సుందరిమణి తన కోరచూపుతో చిరునవ్వుతో లావణ్యదేహప్రదర్శనతో యువక్రీతుని లొంగదీసి, వాని చేతిలోని పవిత్ర జలపూర్ణమైన కమండలువు తీసుకు వెళ్ళిపోయింది.

అంతతో వానిశక్తి నశించగా ఆ రాక్షసుడు తన శూలంతో యవక్రీతుని తరిమి పొడవబోయాడు.

సరిగా భరద్వాజుని ఆశ్రమద్వారందగ్గరే వానిని సంహరించాడు.

అదిచూచి భరద్వాజుడు: "నాయనా! అనాయాసంగా లభించిన విద్య ఇటువంటి అనర్థాలే తెస్తుందని చెప్పినా విన్నావుకావు."

అని గోలు గోలున విలపించి, ఆ తీవ్రవేదనలో రైభ్యుని శపించి, తాముకూడా అగ్నిలోనూకి ప్రాణత్యాగం చేశాడు. శాపగ్రస్తుడైన రైభ్యుడు ఆయన కుమారుని చేతులలోనే మరణించాడు.

అప్పుడు అర్వావసువు సూర్యుని ఉపాసించి తన తండ్రినీ, భరద్వాజ, యువక్రీతులనూ బ్రతికించాడు.

పునరుజ్జీవితుడైన యువక్రీతుడు, తన ఎదురుగా ఉన్న దేవతలను ఉద్దేశించి: "నేముకూడా ఈ రైభ్యునివలెనే తపస్సుచేసి, వేదవేత్తనయ్యాముకదా అయినా ఈయన నాకంటే గొప్పవాడెలా అయ్యాడు?" అనగావారు:

"నాయనా! ఆయన గురు శుశ్రూషక్లేశాంతో వేదవిద్యను సాధించాడు. కనుక అంత శక్తిశాలి అయ్యాడు. అది లేకుండా నువ్వు సాధించావు. ఆ శక్తి నీకు రాదు. విద్య గురుముఖతః నేర్చుకోవాలి నాయనా!" అనివారువెళ్ళారు.

---

## అహంకారం వినాశహేతువు

(ఉద్యోగపర్వంలో కథ యిది. కృష్ణుడు రాయబారానికివచ్చి తను చెప్పవలసిన హితవు చెప్పాడు. అనంతరం ఆ సభలో ఉన్న మహర్షి పరశురాముడు చేసిన హితబోధ)

నాయనా! దుర్యోధనా!

నీకూ, నీ వారికీ సర్వప్రపంచానికీ మేలుకలిగే విషయం చెపుతున్నాను. ఆవేశపడకుండా సావధానంగా విను.

చాలారోజుల క్రితంమాట.

దంభోద్భవుడు అనేపేరుగల రాజు ఉండేవాడు. ఆయన ఈ భూమండలం అంతనూ పాలించేవాడు. భుజబలంలో పరాక్రమంలో ఆయనకు సాటివచ్చేవారు లేరు ఆ రోజుల్లో. అంతటి మహాయోధుడాయన.

ఆయనరోజూ ఉదయంలేచి, కాలకృత్యాలు పూర్తికాగానే బాగా అలంకరించుకొని రత్నకిరీటం ధరించి, కోడెత్రాచువంటి కరవాలంచేత బట్టి సభాభవనానికి వచ్చి బంగారుసింహాసనం అధివసించేవాడు.

వంది మాగధులు ఆయన బలపరాక్రమాలను గానం చేస్తూంటే, కోరమీసం మెలిత్రిప్పుతూ ఆనందించేవాడు.

అనంతరం తన కొలువులో ఉన్న వారందరినీ చూస్తూ:

ఈ భూలోకంలో ఎవడయినా నాతో యుద్ధం చేయగల మహావీరుడున్నాడా! గదా, ఖడ్గ ప్రాసాది ఆయుధాలతోకాని, ఆగ్నేయ, వారుణ, వాయువ్యాది అస్త్రాలతోకాని నన్ను ఎదుర్కొగల వీరుడుంటే చెప్పండి. అంతేకాదు మల్లయుద్ధం చేయగలవీరుడు ఉన్న వాడిని క్షణంలో కడతేరుస్తాను.

అని గర్వంగా నవ్వుతూ భుజాలు ఎగురవేసేవాడు.

ఆయన బలపరాక్రమాలెరిగిన వారెవరూ యుద్ధానికి దిగేవారుకారు.

అంతతో ఆయన అహంకారం నానాటికి పెరుగుతూ వచ్చింది
వా అంతవాడు లేడనే గర్వంతో ఆయన విర్రవీగుతూ తిరుగు
తున్నారు.

అటువంటి అహంకారం ఉన్న రాజుకి అనుచరులుకూడా అటువంటి అవివేకులే దొరుకుతారుకదా!

వారు రోజూ ఆయన బలపరాక్రమాలను పొగుడుతూ ఉండేవారు.

అలాఉండగా ఒకనాడు ఆయనను చూడడానికి సభాభవనానికి వచ్చిన దూరదేశీయులైన విప్రులు —

మహారాజా! మీరు నిజంగా మహావీరులే. బలపరాక్రమ
సంపన్నులే.

అయితే —

గంధమాదనపర్వతంమీద నర నారాయణులని ఇద్దరు తీవ్రనిష్ఠతో తపస్సు చేస్తున్నారు. వారిని జయించగల వీరులు మూడులోకాలలో లేరని విన్నాము. తమకు కోరికఉంటే వారితో యుద్ధం చేయవచ్చు అన్నారు.

ఆ మాట వినడంతో ఆయన ఆగ్రహంతో కత్తి ఝళిపించి నేలమీద పాదంతో తొక్కి!

ఎంతకావరం! నన్నుమించిన యోధులా వారు, అంటూ సేనలు సన్నద్ధం చేసి ధనుర్బాణాలు తీసుకుని బయలుదేరాడు. గంధమాదన పర్వతం చేరాడు.

ప్రశాంతంగా ఉన్న వనంలో వారు తపస్సు చేసుకుంటున్నారు.

వారిని చూస్తూనే తొడగొట్టి యుద్ధానికి పిలిచి, నవ్వుతూ కోరమీసం మెలిత్రిప్పాడు.

నర నారాయణులు తమ ఆశ్రమానికి వచ్చిన మహారాజుకి అతిథి సత్కారాలు జరుపబోగా:

ఇవన్నీ అనవసరం, యుద్ధం, యుద్ధం అని అట్టహాసం చేశాడు.

అప్పుడు వారు:

ఎవరితోనూ సంబంధంలేకుండా కళ్ళుమూసుకుని యీ ప్రశాంత ప్రదేశంలో తపస్సు చేసుకునే మునులం. మాతో యుద్ధం చేయాలనే కోరిక ఎందుకు కలిగింది మీకు, అన్నారు.

వినలేదు మహారాజు.

యుద్ధం చెయ్యకతప్పదు, అన్నాడు

అంటూనే బాణం తొడుగుతూంటే చూచిన నరుడు నవ్వుతూ ఒక దర్భపుల్లతీసి:

ఇదిగో ఈ గడ్డిపరక నీ సేనను నిలబెడుతుంది అని వదిలాడు.

ఆ రాజు బాణవర్షం కురిపించాడు. ఆ గడ్డిపరక అన్నిబాణాలనూ ముక్కలు ముక్కలు చేసింది.

ఈలోగా సేనలోని వారందరూ ముక్కులూ, చెవులూ ఊడిపోయి రోదనం ఆరంభించారు.

రాజుకి తల తిరిగింది.

సేనలు పలాయనం చేస్తున్నాయి

చూసిన రాజుకి గుండె జారింది.

ఆయుధాలన్నీ క్రిందపెట్టి, తలవంచి నర నారాయణుల పాదాలమీద వ్రాలి:

ఆర్యా! నన్ను క్షమించి అనుగ్రహించండి. నా గర్వానికి ప్రాయశ్చిత్తం అయింది, అని దీనంగా ప్రార్థించాడు. అప్పుడు వారు నవ్వుతూ!

మహారాజా!

సిరి సంపదలు కలవారు పేద సాదలకు దాన ధర్మాలు చేసి గొప్పవారు కావాలి.

అలాగే బల పరాక్రమాలు ఉన్నవారు దుర్మార్గుల బారినుండి ప్రజలను రక్షించడానికి తమశక్తిని వినియోగించాలి. అంతేకాని, అహంకారంతో తిరగరాదు.

ఇరుగు పొరుగులకు ఉపకారం చేయని వాడి జన్మవ్యర్థం – అన్నారు.

మహారాజు వారి బోధవిని, ఆనాటినుంచీ అహంకారం విడిచి, అందరి శ్రేయస్సూ దృష్టిలో ఉంచుకొని తన సంపదలను పేదలకు దానం చేస్తూ, తన బలంతో దుర్మార్గులనూ, క్రూరులనూ శిక్షించి, న్యాయమార్గాన ప్రజాసేవచేసి పేరు ప్రఖ్యాతులు పొందాడు.

కనుక, దుర్యోధనా!

అహంకారం, బలగర్వం ఎప్పుడూ పనికిరావు. అవి ఎవరికి ఉంటాయో వారినే నాశనం చేస్తాయి, అన్నాడు పరశురాముడు.



# గరుడ గర్వభంగం

( ఉద్యోగ పర్వంలో రాయబార సమయంలో కణ్వమహర్షి చెప్పిన కథ )

"నాయనా దుర్యోధనా!

దేవలోకానికి అధిపతి అయిన దేవేంద్రుని పేరు విన్నావు కదా! ఆయన రథాన్ని నడిపే సారథి పేరు మాతలి.

ఇంద్రుని మనసు గ్రహించి రథం నడిపించే మాతలికి ముల్లోకాల లోనూ సాటిరాగల సారథులు లేరు. అటువంటి సేవాధర్మం ఎరిగిన మాతలి శాంత స్వభావంతో, సద్గుణ సంపదతో అందరిచేతనూ ప్రశంసలు పొందినవాడు.

ఆయనకు గుణకేశి అని ఒక కూతురు. గుణకేశి ఎంత అందగత్తెయో అంతకంటే గుణవతి, శీలసంపన్న, విద్యావతి. తల్లి దండ్రుల శిక్షణలో ఆమె వంశ సంప్రదాయాన్ని, ఆచార మర్యాదలనూ చక్కగా అలవరచుకొని పదిమందిలో వినయగుణవతిగా పేరు పొందింది.

బాల్యదశ దాటి పదహారేడుల యవ్వనవతి అయింది. అంటే వివాహ యోగ్యమైన వయసులో అడుగుపెట్టింది. వరాన్వేషణ ఆరంభిం చాడు మాతలి.

ఉన్నత వంశంలో పుట్టి, చక్కని అంద చందాలతో గుణవంతు రాలు, విద్యావతి అయిన ఆడబిడ్డకు యోగ్యుడైన వరుడు దొరకడం చాలాకష్టం.

విద్యఉంటే వినయం ఉండదు. విద్యావినయాలుంటే రూపం ఉండదు. ఈ మూడూ ఉంటే సంపద ఉండదు.

విద్యా వినయ గుణరూపాలున్న వరుడు దొరుకుతాడేమో అని మాతలి దేవలోకం అంతా తిరిగాడు. భూలోకం కూడా గాలించాడు.

ప్రయోజనం లేకపోయింది. అయినా ప్రయత్నం విరమించ కుండా తిరుగుతూనే ఉండగా, ఒకనాడు నారదముని కనిపించి, మాతలి బాధ విని ఆయనకూడా తోడుగా బయలుదేరాడు.

ఇరువురూ కలిసి పాతాళంలో వరుణలోకం చేరారు. ఆలోకం లోని వింతలూ, విశేషాలూ వివరంగా చెప్పాడు నారదుడు. అన్నీ విని మాతలి :

దేవమునీ :

నేను దేవతల ప్రభువైన ఇంద్రుని సారథిని కదా ! ఈ లోకం రాక్షసులకు నిలయం. వీరితో బాంధవ్యం నాకు కుదరదు, అన్నాడు.

గరుడ లోకం తిరిగారు. అక్కడ కూడా యోగ్యుడైన వరుడు దొరకలేదు. రసాతలానికి వెళ్ళారు.

ఆ లోకం ప్రజలందరూ భోగమయ విలాస జీవితం గడుపుతున్నారు. అది మాతలికి రుచించలేదు.

అప్పుడు నాగలోకానికి చేరారు. ఆ లోకానికి రాజధాని భోగవతి. ఆ రాజధానీ నగరంలో అన్వేషణ ఆరంభించారు.

నాగ వంశ ప్రముఖులందరి గుణగణాలనూ నారదుడు వివరిస్తూ వారిని చూపిస్తున్నాడు.

వింటూ వింటూన్న మాతలి కనులు ఒక నవసుందరాంగుని మీద నిలిచాయి.

అది గ్రహించి నారదుడు మాతలీ !

నాగలోకంలో ఐరావత వంశం ప్రఖ్యాతమయింది. అందులో పెద్ద ఆర్యకుడు. ఆయన కుమారుడు చికురుడు.

నువ్వు చూసే యువకుడు సుముఖుడు. ఈ సుందర గుణ సంపన్నుడయిన సుముఖుడు చికురుని ప్రియ పుత్రుడు, అని చెప్పాడు. తరువాత 'కులపెద్ద' అయిన ఆర్యకునితో :

'నాయనా ! ఈయన ఇంద్రసారథి మాతలి. ఈయన కుమార్తె గుణకేశి. ఆమె రూపంలోనే కాక గుణసంపదలో కూడా ఎందరికో పాఠాలు నేర్పగలది. ఆ బిడ్డను మీ ఇంటి కోడలుగా పంపాలని మా సంకల్పం అన్నాడు.

అర్యకుడు 'దేవమునీ! వినతానందనుడైన గరుత్మంతుడు మా నాగజాతిని ఆహారంగా తీసుకుంటాడని మీ రెరుగుదురు. మొన్ననే మా చికురుడు ఆయనకు ఆహారం అయాడు. అప్పుడే చెప్పాడాయన –

తరువాయి వంతు సుముఖునిది, అని. ఈ విషయం తెలిసీ ఈ వివాహం జరిపి మీ ఆడబిడ్డను జీవితాంతం దుఃఖసముద్రంలో వదల మంటారా!' అన్నాడు.

అప్పుడు మాతలిని వెంటబెట్టుకొని నారదుడు శ్రీమన్నారాయణుని సమీపించి, చేతులు జోడించి, విషయం వివరించగా ఆయన సుముఖునికి పూర్ణాయుర్దాయం అనుగ్రహించాడు.

తిరిగి వచ్చి మాతలి తన బిడ్డను నాగలోకం కొని వచ్చి సుముఖునితో వివాహం జరిపించాడు.

వా రుభయులూ అనురాగంతో ఆనందమయ దాంపత్యం సాగిస్తున్నారు.

ఈ వార్త గరుత్మంతుని చెవిని పడింది.
తీవ్ర క్రోధంతో నాగలోకం చేరి

'చతుర్దశ భువనాలకూ అధిపతి అయిన మహా విష్ణువు భారాన్ని నేను తప్ప ఇతరుడు భరించ లేడని తెలియదామీకు! అంతటి శక్తిగల నన్ను మీరు అవమానించారు, నామాట వినకుండా ఈ వివాహం జరిపించి' అని అహంకార గర్వంతో తన శక్తి ప్రదర్శనకు ఉపక్రమించ బోతుండగా గ్రహించిన మహావిష్ణువు అక్కడకు వచ్చి మందహాసంతో:

'నాయనా! వినతానందనా! నా భారం అంతా మోయగల శక్తిమంతుడివి కదా! ఏదీ, నా చెయ్యి ఒక్కటి నీ వీపుమీద ఉంచుతాను, చూడు,' అని గరుత్మంతుని మీద తన చెయ్యి ఉంచాడు.

అంతే! ఇంతకాలంగా శ్రీమన్నారాయణుని వాహనంగా ఉన్న గరుత్మంతునికి ఆ చెయ్యి బరువుకి కళ్ళు తిరిగి, కాళ్ళు పట్టుతప్పి, రెక్కలు గజగజలాడి, నోరుఎండి నాలుక పిడచకట్టింది.

అప్పుడు మహావిష్ణువు తన చేతితో పెన్నుదువ్వి ఆశ్వాసించి।
'నాయనా। గర్వం, అహంకారం, ఎప్పుడూ కొరగానివి. వినయంతో, పరోపకార దృష్టితో జీవించే వారికే ఉత్తమ గతులు ప్రాప్తిస్తాయి', అన్నాడు.

అనంతరం గరుడవాహనం మీదనే ఆయన వైకుంఠం వెళ్ళాడు.
'చూశావా, దుర్యోధనా। గర్వం ఎటువంటి ఆపదలు తెచ్చి పెడుతుందో। కనక అది విడిచి పెట్టాలి' అన్నాడు కణ్వమహర్షి.

---

## అన్నదాన మహిమగొప్పది

(ఈ కథ అశ్వమేధ పర్వంలో ఉంది. వైశంపాయమునిచే జనమేజయునికి చెప్పబడింది.)

ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో అతిరథులూ, మహారథులూ ఎందరో కన్నుమూశారు. పద్దెనిమిది అక్షోహిణులసేనలో కురుపక్షంలో అశ్వత్థామ కృతవర్మ, కృపాచార్యులు మిగిలారు. ఇటు పాండవులయిదుగురు, కృష్ణుడూ, సాత్యకి మిగిలారు.

ధర్మరాజుకి పట్టాభిషేకం జరిపించారు. అంపశయ్యమీద ఉన్న భీష్మపితామహుడు సర్వధర్మవిషయాలూ బోధించి ఉత్తరాయణ పుణ్య కాలం ప్రవేశించగానే యోగమార్గాన దివ్యలోకాలు చేరాడు.

జరిగిన సంగ్రామంలో ఆప్తులు, ఆత్మీయులూ అందరూ మరణించారనే బాధ ధర్మరాజు మనస్సుని వికలంచేస్తూనే ఉంది. ఈ మహా పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకోవాలని భావించగా అశ్వమేధం సాగించమని విద్వాంసులు సలహా యిచ్చారు.

వారి ఆదేశానుసారం అశ్వమేధయాగం ఆరంభించాడు.

దేశ దేశాలనుంచి చక్రవర్తులూ, విద్వాంసులూ ఎందరో వచ్చారు. వివిధ నగరాలనుంచి, జనపదాలనుంచి లక్షలాది ప్రజలు ఆ యాగం తిలకించడానికి వస్తున్నారు.

చూడవచ్చిన వారందరికీ వస్త్రదానంతో పాటు నిర్విరామంగా అన్నదానంగూడా జరిపించాడు.

యోగ్యులైనవారికి సువర్ణ, మణి, రత్నదానాలు చేశాడు. అక్కడకు వచ్చినవారిలో సంతృప్తిపడకుండా ఉన్నవాడు ఒకడూ లేడు.

అలాసర్వజన సంతృప్తికలిగించిన అశ్వమేధయాగం చూచిన దేవతలు పూలవాన కురిపించి ధర్మరాజుని అభినందించారు.

అలా ఆనందించే సమయంలో ఆ యాగశాల సమీపానికి ఒక ముంగిస వచ్చింది.

వారంతరూ ఈ శాలలోకి ముంగిస ఎలా వచ్చిందా? అని ఆశ్చ ర్యంతో చూస్తున్నారు.

అప్పుడా ముంగిస నవ్వుతూ:

'దేవతలుకూడా అభినందించే యాగమా యిది' అంది.

తెల్లబోయారు అందరూ.

దాని శరీరంలో ఒకభాగం బంగారు కాంతు లీనుతోంది. రెండవ భాగం మామూలు చర్మంతో ఉంది.

'సక్తు ప్రస్థుడి ధర్మ బుద్ధితో పోలిస్తే యీ యాగశాలలో జరిగిన దానం ఏమాత్రం'? అంది.

అందరూ తెల్లబోయారు.

దానినిచూస్తూ:

'ఎవరా మహనీయుడు! ఏమిటాయన కథ'? అన్నారు.

అలా వారు ఆతురతతో అడుగగా:

'సావధానంగా వినండి' అని ఇలా చెప్పింది ముంగిస.

'ఈ ధర్మభూమి అయిన కురుక్షేత్రంలో చాలాకాలం క్రితం సక్తు ప్రస్థుడనే పేరుగల గృహయజమాని ఉండేవాడు.

ఆయనకు ఒకే కుమారు డుండేవాడు. ఆ అబ్బాయికికూడా వివాహం అయింది. వారు నలుగురూ సర్వభూత కోటిని దయతోచూస్తూ, కామ క్రోధాలు విడిచి తపస్సు చేసుకుంటున్నారు.

కొడుకూ, కోడలూ ఆ వృద్ధులను సేవిస్తూ ఉండేవారు. ఎవ్వరికీ హానిచేయకుండా ఏ పూటకు ఆ పూట దొరికినదాన్ని తిని తృప్తిగా జీవితం గడుపుతున్నారు.

పరబ్రహ్మమీదనే మనస్సునిలిపి జీవితం సాగించడానికే ఆహారం తీసుకునేవారు. ఆ జీవితంకూడా పరమేశ్వరధ్యానానికే అర్పించేవారు.

అలా ఉండగా ఒకనాడు:

వారు తమ పరిసర ప్రాంతాలలోని చేలలో తిరిగి, అక్కడ రాలిన ధాన్యపుగింజలు ఏరితెచ్చుకుని, దంచి, పిండిచేసి, వండుకుని నలుగురూ సమంగా పంచుకున్నారు.

తినడానికి సిద్ధమవుతున్నారు. అటువంటి సమయంలో, ఒక వృద్ధుడు వచ్చాడు. ఆయనకళ్ళులోతుకు పోయాయి. ఎముకలు బయట పడుతున్నాయి. డొక్కలు మాడి ఉన్నాయి.

ఆకలి, ఆకలి అని నీరసంగా అడిగాడు.

ఆయనను ఆదరంగా తీసుకునివచ్చి, తన పక్క కూర్చొ పెట్టుకుని

ఆర్యా! తమరు కుశలమే కదా! మా ఆతిథ్యం స్వీకరించి, అనుగ్ర హించండి. ఏ ప్రాణికీ హాని కలుగకుండా, ఏ పాపానికి ఒడిగట్టకుండా మేంతెచ్చుకున్న ధాన్యపుగింజల పిండితో వండిన ఆహారం యిది. దీనితో మీ ఆకలిబాధ నివారించుకోండి! అని గృహయజమాని తనభాగం ఆయ నకు వడ్డించాడు.

అది ఆరగించి తనకింకా ఆకలిగాఉంది అన్నాడు.

ఆ మాట వింటూనే ఆయనభార్య తనభాగం యిచ్చింది.

ఇంకా ఆ వృద్ధుని ఆకలిబాధ తీరలేదనితెలిసి కొడుకూ, కోడలూ కూడా వారి ఆహారం ఆయనకు పెట్టారు.

అంతా ఆరగించి, ఆయన ఆనందంతో -

'నాయనా! మీ అతిథిసత్కారం, అన్నదానం నాకు తృప్తి కలి గించాయి. నీతోపాటు నీకుటుంబంలోని వారంతా ఎంతో ఆకలితో బాధ పడుతూకూడా మీరు తినబోయే ఆహారం దానంచేసి, పుణ్యం సాధించారు. మీ దానబుద్ధిని సర్వలోకాలు మెచ్చుతుంటాయి.

ప్రపంచంలో ఆకలితో ఉన్న మనిషి ఎటువంటి పాపానికైనా ఒడి గడతాడు. అన్నంకోసం ఎన్నోదారుణాలు చేస్తాడు మానవుడు.

అటువంటి దశలో మీ దానబుద్ధి ఎంతగొప్పదో దేవతలుకూడా గ్రహించారు దయగలగుండె కలవారే ఆకలి దూరం అవుతారు. ఈ రెండూవున్న మీకు దివ్యలోకాలు లభిస్తాయి.

ఆకలితో అలమటించే ప్రాణికి యింత అన్నంపెట్టడంకంటే ఏ దానమూ గొప్పదికాదు. అటువంటి అన్నదానంచేసిన పుణ్యాత్ములు మీరు ' అంటూండగా దేవవిమానం వచ్చింది. వారందరూ ఆ విమానం ఎక్కి వెళ్ళారు.

ఇదంతా వింటూ చూసిననేను వారు వెళ్ళిన అనంతరం ఆ ప్రాంత ములో ఆ అతిథిపాదాలు కడిగినచోట తిరిగాను. తిరిగినప్రక్క ఆ పాదాలు కడిగిన నీటితడి తగిలిన నా దేహంలో ఈ భాగం బంగారు మయమయింది. దానం అంటే అదీ.

అనంతరం ఎన్నెన్నో దాన, ధర్మాలుసాగే ప్రదేశాలు తిరిగినా ఈ రెండవప్రక్క దేహం యిలానే ఉండిపోయింది. ఇక్కడకూడా అంతే. నవ్వుతూ వెళ్ళిపోయింది ముంగిస.



## ఉత్తమ సంసారి ఇలా ఉండాలి

( ఈ కథ ఆదిపర్వంలో ఉంది. )

"మహామునులారా !

జరత్కారుడనే మహర్షి పేరు మీరు వినే ఉంటారు"

అని సూతుడు కథ మొదలుపెట్టాడు.

"జరత్కారుడు బ్రహ్మచర్య నియమాలు విడువకుండా తపోదీక్షతో అరణ్యాలలో తిరుగుతూ బ్రహ్మపదం చేరడానికి ప్రయత్నిస్తున్నాడు.

అలా ఆయన తిరిగే రోజులలో ఒకనాడు ఒక అడవిలో ఒక విచిత్రం చూశాడు.

క్రింద పెద్దగొయ్యి. దాని ప్రక్కగా ఒకే ఒక్క వేరు ఆధారంగా ఉన్న ఒక రకం చెట్టు.

దానిమీద తలక్రిందులుగా వ్రేలాడుతూ తపస్సు చేసే ఋషులు.

ఆశ్చర్యంతో వారిని సమీపించి :

'అయ్యా ! మీరింత తీవ్ర తపస్సు ఎలా చేస్తున్నారు. నాకు కూడా దీని విధానం బోధించండి అన్నాడు.

నాయనా ! మేము పరమ విషాదంతో యిలా ఉన్నాం. మా వంశంలో జరత్కారుడనే వాడు పుట్టాడు. వాడు వివాహం చేసుకుని వంశ వృద్ధి చేయకుండా ఉండటం వల్ల ఈ దీన దశలో ఉన్నాం.

ఈ చెట్టుకు మిగిలిన వేరు కూడా జరత్కారుని మరణంతో తెగి పోతుంది. మేము ఈ నరకకూపంలో పడతాం. వాడు వివాహం చేసుకుని సంతానవంతుడైతే మాకు దివ్యలోకాలు దొరుకుతాయి' అన్నారు.

అప్పుడా ముని :

'అయ్యా, నేనే ఆ జరత్కారుడను. మీ శ్రేయస్సు కోసం నేను వివాహం చేసుకుని వంశవృక్షాన్ని నిలబెడతాను' అని తనకు తగిన భార్యకోసం అన్వేషణ ఆరంభించాడు.

తనకు కాబోయే భార్య కూడా తన పేరుతోనే ఉండాలని ప్రకటిస్తూ తిరుగుతున్నాడు.

ఈ వార్త విన్నాడు నాగజాతి ప్రముఖుడు వాసుకి.

తన చెల్లెలు జరత్కారువును తీసుకుని ఆ మహాముని దగ్గరకు వచ్చి నమస్కరించి:

'మహామునీ! ఈమె నా సోదరి. దీని పేరు జరత్కారువు. మీరు ఈమెను వివాహమాడి మన ఉభయ వంశాలూ ఉద్ధరించండి' అని ప్రార్థించాడు.

అందుకు అంగీకరించాడు జరత్కారుడు.

ఒకానొక సుముహూర్తంలో వివాహం జరిగింది. మొదటి రాత్రి గదిలోకి వచ్చిన భార్యతో -

'ధర్మచారిణీ! ఈ రోజు మొదలు నా మనస్సుకి వ్యతిరేకంగా నువ్వు నడిస్తే ఆ క్షణంలో నిన్ను విడిచి వెళ్ళిపోతాను. ఈ నియమాన్ని మరువకు!' అన్నాడు.

జరత్కారువు ఆ నియమానికి అంగీకరించి, నిరంతరం పతిసేవతో జీవితం గడుపుతున్నది.

అలా ఆయన మనసుకి అనుగుణంగా మెలగుతూ, ఆయన అనురాగం పొంది దాంపత్య జీవితం సాగిస్తూ, గర్భవతి అయింది.

రోజులు గడుస్తున్నాయి.

ఒకనాడాయన తిరిగి తిరిగి వచ్చి ఒక చెట్టు నీడన, తన భార్య తొడమీద తల పెట్టుకుని నిద్రపోతున్నాడు.

సూర్యుడు పడమటి కొండకు చేరాడు.

మునీంద్రుడు గాఢంగా నిద్రిస్తున్నాడు.

అప్పుడామె ఆలోచనలో పడింది.

సంధ్యాసమయంలో జరపవలసిన వేదవిహిత కర్మలకు లోపం రాకూడదు కదా! ఇప్పుడీయనను లేపితే కోపం వస్తుందేమో! లేపకపోతే

ధర్మలోపం జరుగుతుంది. ఆయనకు కోపంవస్తే అది నేను భరించాలి. కాని ధర్మలోపం జరగరాదు కదా - అని నిశ్చయించి నిద్ర లేపింది.

సుఖనిద్రకు భంగం కలిగించినందుకు ఆయనకు కోపం రానే వచ్చింది.

'ఎందుకు నాకు నిద్రాభంగం కలిగించావు?' అని తీవ్రంగా అడి గాడు.

'స్వామీ! సంధ్యాసమయం అయింది. మీరు విధ్యుక్తకర్మలు జరపాలి కదా!' అంది.

'ఎంత వెర్రిదానివి. నేను నిద్రపోతూండగా అస్తమించడానికి సూర్యుడికి ఎన్ని గుండెలు కావాలి! ఈ మాత్రం గ్రహించలేక నన్ను అవమానించావు. కనుక నా నియమ ప్రకారం నిన్ను విడిచి పెడుతు న్నాను. అయితే యింత కాలం నువ్వు చేసిన పరిచర్య నాకెంతో సంతో షము కలిగించింది.

ఇప్పుడు నువ్వు గర్భవతివి. సూర్యసమ ప్రభావుడైన కుమారుడు నీకు కలుగుతాడు. వాడు ఉభయవంశాలనూ ఉద్ధరిస్తాడు. నువ్వు నిర్వి చారంగా మీ అన్నగారి దగ్గరకు వెళ్ళు' అని తన కమండలువు తీసు కుని ఆయన వెళ్ళిపోయాడు.

విచారంతో జరత్కారువు తన అన్నగారి దగ్గరకు వచ్చింది.

జరిగిన విషయం విన్నాడు వాసుకి. సోదరిని ఓదార్చి, ఆదరంతో చూసుకుంటున్నాడు.

నెలలు నిండిన అనంతరం జరత్కారువు మగబిడ్డను కన్నది.

వాసుకి పరమానందంతో వారుభయులకూ ఉచిత సేవలు చేయిం చాడు.

పెరిగిన కుమారునికి ఆస్తీకుడని పేరు పెట్టారు.

ఆ బాలుడు పెరిగి పెద్దవాడై, సర్వ విద్యలూ నేర్చి పలువురి ప్రశంసలు పొందాడు.

"ఈ ఆస్తీకుడే జనమేజయ మహారాజు ఆరంభించిన సర్ప యాగాన్ని ఆపి తన తల్లి చుట్టాలయిన నాగజాతిని మహా విపత్సముద్రం నుండి రక్షించి ప్రఖ్యాతి పొందాడు." జ్ఞానులయినవారు సంసార కూపంలో మునిగిపోక తమ కర్తవ్యం పూర్తిచేసి విరాగులవాలి.

---

# వాతాపి జీర్ణం

(ఈ కథ అరణ్యపర్వంలో ఉంది.)

చాలా రోజులక్రితం మాట.

అగస్త్యుడనే పేరుగల బ్రహ్మచారి ఉండేవారు. ఆయన తీవ్ర నిష్ఠతో తపస్సు చేస్తూ సర్వ ప్రాణి కోటినీ దయాహృదయంతో చూసే వాడు.

ఆయన తపోదీక్ష మహామహులెందరికో ఆశ్చర్యాన్ని ఆనందాన్ని కలిగించేది. అలా తపస్సు చేసుకుంటూ అరణ్యాలలో తిరుగుతూండగా వాని పితృ పితామహులు కనిపించి:

'నాయనా, యోగ్యురాలయిన కన్యను వివాహం చేసుకుని నువ్వు పుత్ర సంతానం పొందాలి. లేకపోతే మాకు ఉత్తమ లోకాలు దొరకవు' అన్నారు.

కులవృద్ధుల మాట శిరసావహించి అగస్త్యుడు తనకు తగిన భార్య కోసం అన్వేషణ ఆరంభించాడు.

తిరిగి తిరిగి విదర్భదేశం చేరాడు.

ఆ రాజుగారి యింట మెరపు తీగెవంటి లావణ్యంతో, నిర్మల సరోవరంలోని నల్ల కలువ వలె పెరుగుతూన్న లోపాముద్రను చూశాడు.

అంద చందాలలోనే కాదు వినయగుణ శీలాలలో కూడా ఆమె యోగ్యురాలని గ్రహించాడు.

ఆ మహారాజు అగస్త్య మహర్షి రాగానే ఆయనకు స్వాగతం పలికి, అర్ఘ్యపాద్యాలతో పూజించాడు.

వారి పరిచర్యలకు సంతోషించి ఆ మునిచంద్రుడు:

'మహారాజా! మా వంశాన్ని ఉద్ధరించే ఉత్తమ సంతానం కోసం నీ కుమార్తెను నా భార్యగా కోరుతున్నాము' అన్నాడు. మహారాజు గుండె దడ దడ లాడింది. మనస్సు ఆందోళనలో పడింది. దీని

చీనాంబరాలతో మణిరత్న భూషణాలతో, హంసతూలికా తల్పంమీద రాజభవనంలో వందలాది దాసీజనాల సేవలందుకుంటూ ఇంద్రభోగం అనుభవించవలసిన తన కూతురు, ఈ మునీశ్వరుడి భార్యగా వనవాసం చేస్తూ పటకుటీరాలలో నార చీరలు ధరించి, కందమూల ఫలాలు తింటూ జీవించగలదా! అనే సందేహంలో పడ్డాడు.

ఈ వార్త విని మహారాణి విచార సాగరంలో మునిగింది.

అది చూసి లోపాముద్ర చిరునవ్వుతో తండ్రిని సమీపించి:

'నా వల్ల మీరు కష్టాలపాలు కానవసరం లేదు. నేను సంతోషంతో ఈ మునీశ్వరుని భార్యగా, ఆయన సేవచేసి వారి అనుగ్రహం పొందుతాను' అంది.

విధి విహితంగా లోపాముద్రా పరిణయం జరిపించాడు మహారాజు.

లోపాముద్ర తన ఆభరణాలు, చీని చీనాంబరాలు విడిచి నార చీరలతో సామాన్య మునిపత్ని వేషంతో ఆయన వెంట అరణ్యానికి వచ్చి నిరంతరం పతిసేవలో ఆయన హృదయాన్ని చూరగొన్నది.

గంగానదీ తీరాన రమణీయ వనంలో పట కుటీరంలో రాజపుత్రిక నార చీరలతో చలిగాలులూ, వేడిగాడ్పులూ లెక్కచెయ్యకుండా ఎంతో ఓరిమితో సేవలు చెయ్యడం ఆ మునిని ఎంతగానో అలరించింది.

అయినా ఆయన తన ఋషిధర్మాన్ని విడువకుండా వేదవిహిత కర్మలే కొనసాగిస్తున్నారు. రోజులు సాగిపోతున్నాయి. కాలచక్రం తిరుగుతున్నది.

ఆ విధంగా కొంతకాలం గడిచాక ఒకనాడు లోపాముద్ర ఋతుస్నానం చేసి సర్వాంగ శోభతో ఆశ్రమ ప్రాంగణంలో పచయాడు చుండగా మహర్షి మనస్సు చలించింది.

ఆమెను చేరపిలిచి, చెయ్యిపుచ్చుకుని; బుగ్గ ముద్దాడబోగా ఆమె మందహాసంతో వెనుదిరిగి!

'స్వామీ! ఆశ్రమ ధర్మాను సారం మనం ఈ పట కుటీరంలో దర్భ శయ్యలమీద జీవితం గడుపుతున్నాం. ఇప్పుడు మీకు సంసార సుఖం కావాలంటే, నేను మానాన్న గారింట ఏ భోగభాగ్యాలతో ఉండే దానినో అవి సమకూర్చగలిగితే, సుఖంగా ఆ సంతోషం మీకు అందివ్వ గలను' అని క్షణం ఆగి, మీ వంటి మహా తపస్వికి అవి సమకూర్చడం నిమిషాలలో పని. నా ఋతుకాలం పూర్తి కాకుండా అవి సమకూర్చండి' అంది.

ఆలోచించాడు, ఆ మునీశ్వరుడు. ఈ సాంసారిక సుఖంకోసం తపశ్శక్తిని వ్యయం చేయడం యిష్టం లేకపోయింది.

ఏ మహారాజు నయినా అర్థించాలని బయలుదేరాడు. వెళ్ళి ముగ్గురు మహారాజులను దర్శించి:

'ఎవరికీ కష్టం కలగకుండా మీ ఆదాయంలో నా కెంత దానం చెయ్యగలరు', అని అడిగాడు.

వారందరూ తమ ఆదాయ వ్యయాలు సమంగా ఉన్నా యన్నారు.

వారి సూచనానుసారం ఇల్వలుడనే దానవరాజు దగ్గర కావలసిన సంపదలన్నీ ఉన్నాయన్నారు. ఆయన ఈ రాజులను వెంటబెట్టుకుని అటే బయలుదేరాడు.

ఈ ఇల్వలుడు వాతాపిసోదరుడు. వారిద్దరూ ఒక అరణ్యంలో ఉంటూ ఆ దారిని వచ్చేవారిని భోజనానికి పిలుస్తారు. వారు రాగానే వాతాపి మేకలా మారిపోతాడు.

ఆ మేకను చంపి వండి పెడతాడు, ఇల్వలుడు. వారు హాయిగా భుజించాక ఇల్వలుడు:

'సోదరా, వాతాపి'! అని పిలవగానే వాడు పొట్ట చీల్చుకుని బయటపడగానే అన్నదమ్ములిద్దరూ ఆ అతిథిని వండుకు తింటారు.

అది వారి జీవన విధానం.

అగస్త్యుడు తనతో రాజులను వెంటబెట్టుకుని రాగానే వినయంగా వెళ్ళి వారికి స్వాగతం పలికి ఆశ్రమానికి తీసుకు వెళ్ళారు.

వారి ఎదురుగానే మేకను వండి పెట్టబోగా ఆ రాజులు భయంతో మునివైపు చూశారు.

ఆయన వారికి అభయమిచ్చి వండినదంతా ముందు నాకు వడ్డించు. మిగిలితే వారి విషయం చూద్దాం' అన్నాడు

సరిగ్గా అదే సమయానికి ఇల్వలుడు –

సోదరా! వాతాపీ'! అని అరిచాడు.

అదివిని అగస్త్యుడు: 'ఇంకా ఎక్కడ వాతాపి! వాడింక తిరిగి రాడు', అని నవ్వగా ఇల్వలుడు భయపడి:

'స్వామి! క్షమించండి' మీకు నా సర్వ సంపదలూ యిస్తాను, అని తన వద్ద నున్న మణిరత్న సువర్ణ రాసులు రథంమీద ఉంచి ఆయనకు అర్పించాడు.

ఆయన కదలబోతుండగా అయనను సంహరించబోగా మహర్షి వెను తిరిగి హుంకరించాడు. ఇల్వలుని దేహం గుప్పెడు బూడిద అయింది.

మహాముని ఆ సంపదతో ఆశ్రమానికి వచ్చి:

'ధర్మచారిణీ! లోకంలో అందరిలా ఉండే పుత్రులు, అసంఖ్యాకంగా కావాలా? గుణశీల వంతుడయిన కుమారుడు ఒకడు కావాలా? అని అడిగారు.

ఆవిడ గుణవంతు డొకడు చాలునంది.

అనంతరం ఆ దంపతుల సంసార యాత్రా ఫలంగా దృఢదస్యుడనే మహాతపస్వి ప్రభవించాడు.

వాతాపిజీర్ణం జీర్ణం జీర్ణం వాతాపిజీర్ణం అనే నానుడి ఈ కథ వల్ల పుట్టింది. ఇది భోజనానంతరం ఉచ్చరి స్తే తిన్నది బాగ జీర్ణమవుతుందని పెద్ద లంటారు.

## శిబిచక్రవర్తి దాతలలో సాటిలేనివాడు

(అరణ్య పర్వంలో రోమశ మహర్షి ధర్మరాజుతో చెప్పిన కథ)

ఉశీనరుడనే మహారాజుండేవాడు. ఆయన కుమారుడు శిబి. ఈయన మహాదాతగా లోకలోకాలలో ప్రఖ్యాతి పొందాడు.

అంతటి కీర్తి వచ్చిన శిబి చక్రవర్తి దాన విశేషం ఏమిటో పరీక్షించాలని ఇంద్రుడు, అగ్ని బయలుదేరారు.

అగ్నిహోత్రుడు పావురం రూపం ధరించాడు.

దేవేంద్రుడు డేగలా బయలుదేరాడు.

ఆ పావురాన్ని తరుముతూ డేగవస్తున్నది. పావురం గజ గజ వణుకుతూ ఎగిరి ఎగిరి అలసటతో శిబిచక్రవర్తి దగ్గరకు వచ్చిపడి, 'శరణు శరణు, మహారాజా'! అని ప్రార్థించింది.

అప్పుడు అక్కడే ఉన్న రాజపురోహితుడు:

'మహారాజా! ఈ పావురం ప్రాణభయంతో నిన్ను శరణువేడింది. ఏ జీవికయినా ప్రాణమంత ప్రీతికర మయింది మరొకటి లేదు. అలానే ప్రాణరక్షణ కంటె ఉత్తమ కర్మలేదు.

కాని - పావురాలను చేరదీయడం మృత్యు సూచక మంటున్నారు విద్వాంసులు. దానికి ప్రాయశ్చిత్తం తప్పదు' అన్నాడు.

అది విని ఆ పావురం:

"మహారాజా! ఆ డేగకు భయపడి నిన్ను శరణువేడాను. నేనొక మహామునిని. ఆ రూపం విడిచి యిలా తిరుగుతున్నాను. దీనులకూ, అసమర్థులకూ మహారాజే రక్షకుడని వేదాలు ఘోషిస్తున్నాయి కనుక నిన్ను శరణు వేడుతున్నాను" అంది.

అప్పటి కక్కడకు చేరిన డేగ:

'మహారాజా! ప్రతి జీవికీ ఎన్నో రూపాలు ప్రాప్తిస్తాయి. అది పావురమై నిన్ను శరణు వేడింది. అయితే పావురాలు డేగలకు ఆహారం

అని మరిచిపోకు. నా నోటి దగ్గర ఆహారమయిన ఈ పావురాన్ని విడిచి పెట్టి నా ప్రాణాలు కాపాడు" అంది.

ఆ పక్షుల మాటలు వింటున్న శిబిచక్రవర్తి మనస్సు ఆందోళనలో పడింది.

'ప్రాణ భీతితో వచ్చి శరణు వేడిన వారికి అభయమివ్వని రాజు యొక్క దేశంలో వానలు కురియక, పంటలుపాడి క్షామదేవత విలయ తాండవం చేస్తుంది. పయిగా అటువంటి రాజ్యంలో ప్రజలకు రక్షణలేక నానా బాధలు పడతారు. అందువల్ల మహారాజు నరకంలో పడతాడు.

మరి - ఈ డేగ ఆకలితో ఉంది. దాని ఆహారం పావురం. దాని నోటిముందు అన్నం తీసెయ్యడమూ పాపమే. ఇప్పుడు నా కర్తవ్యం ఏమిటి?' అని ఆలోచించి, ఆలోచించి రాజు -

'ఓ డేగా! నీకు యింతకంటె రుచిగా ఉండే, బలం కలిగించే ఆహారం యిప్పిస్తాను. దీన్ని విడిచిపెట్టు' అన్నాడు.

డేగ: మహారాజా! ఈ పావురంమాంసం కంటె రుచికరమయిన ఆహారం మరొకటి లేదు. ఏ పక్షి దొరకనప్పుడు పావురాలనే మాకు ఆహారంగా యిచ్చాడు బ్రహ్మదేవుడు.

శిబి: ఓ డేగా! శరణు వేడిన ఈ పావురాన్ని విడిచి ధర్మహాని చెయ్యను. నా ప్రాణాలు వదులు కుంటాను కాని అభయమిచ్చిన ప్రాణికి హాని జరగనివ్వను. ఈ విషయం లోకాలన్నిటికీ తెలును. అందుచేత నువ్వు పావురాన్ని విడిచి ఏమయినా అడుగు.

డేగ: మహారాజా! నువ్వు అంత దయచూప దలిచినట్లయితే నా మాట విను. నీ కుడితొడ చీల్చి దానిలోని మాంసం తీసి ఈ పావురం బరువుతో సమంగా తూచి ఆ మాంసం నాకియ్యి. ఆరగిస్తాను.

అది వింటూనే శిబి చక్రవర్తి, త్రాసు తెప్పించి ఒక వయిపు పావురాన్ని ఉంచి, కత్తితో తనతొడ కోసి మాంసం తక్కెడలో ఉంచాడు. ఎంత మాంసం వడుతున్నా పావురం బరువుకి సమం కావడం లేదు. రెండవతొడ, చెయ్యికోసిపెట్టినా అది తూగలేదు. అంతతో శిబితానే త్రాసులో కూర్చున్నాడు.

డేగ: చాలు. నేను వెళుతున్నాను, అని ఎగిరిపోయింది.

అది చూసి శిబిచక్రవర్తి:

'ఓ పావురమా! నువ్వేపరవు. ఏమిటి నీ కథ'? అని అడిగారు.

'మహారాజా! నేను అగ్నిహోత్రుడను. ఆ డేగ దేవేంద్రుడు. నీ కీర్తి విని, నీ శరణాగత రక్షణ దృష్టినీ, దాన శక్తినీ పరిశీలించాలని వచ్చాం. నువ్వు విజయం పొందావు. నీ యశశ్చంద్రికలు ఈ భువన భవనం అంతటా వ్యాపిస్తాయి. నీకు కలిగే కుమారుడు కూడా నీ కీర్తిని నిలబెడతాడు', అని అదృశ్యమయింది.

ఈ విధంగా శరణువేడిన ప్రాణికోసం తన శరీరాన్నే దానం చేసిన మహాపురుషుడు కనుకనే ఈ నాటికీ శిబి చక్రవర్తి పేరు ప్రఖ్యాత మయింది. దాతలపేరు చెప్పేటప్పుడు ఆ పేరు తప్పని సరిగా చెప్పు కుంటారు.



## గజకచ్ఛప సంగ్రామం

(ఆదిపర్వంలో ఎన్నెన్నో చిత్రవిచిత్రమైన కథలున్నాయి. అందులో ఒకటి గరుత్మంతుడు తనతల్లి వినతకు దాసీత్వం తప్పించడానికి నాగులకోరికమీద 'అమృత కలశం' తేవడానికి బయలుదేరుతాడు. దారిలో తన ఆకలితీరేదారి చెప్పమని తండ్రి అయిన కశ్యప ప్రజాపతిని అడిగాడు. ఆయన చెపుతున్నారు.)

నాయనా!

ఇక్కడకు సమీపంలోనే ఒకానొక దివ్యమైన సరోవరం ఉంది. అది కలువలతో, కమలాలతో, వివిధరకముల జలపక్షులతో నయనానందకరంగా ఉంటుంది. ఆ సరోవరంలో ఒక పెద్ద కచ్ఛపం(తాబేలు)ఉన్నది. కొలను ఒడ్డునే ఒక మత్తగజం ఉన్నది.

ఈ ఏనుగు తన పొడుగాటి తొండంతో ఆ తాబేలునుపట్టిలాగి హింసిస్తూండేది. తాబేలు ఏనుగుకాళ్ళుపట్టి లోపలకు ఈడ్చి హింసపెడ్తూ ఉండేది.

అలా అవి ఎన్నో ఏళ్ళుగా కొట్టుకుంటున్నాయి. ఆ రెండు జంతువులూ నీకు ఆహారంగా సరిపోతాయి అన్నాడు.

అదివిని గరుత్మంతుడు:

'పితృపూజ్య! వాటిమధ్య ద్వేషకారణం ఏమిటి? ఏనుగుతో తాబేలుకు పోరాటం ఎలా సంభవం!' అని ప్రశ్నించాడు.

కశ్యపుడు:

"నాయనా! ఆ ప్రాణులు రెండూ పూర్వజన్మలో మానవులు. అన్నదమ్ములుగాపుట్టాయి. పెద్దవాడు విభావసుడు. రెండోవాడు సుప్రతీకుడు.

ఇద్దరు నిత్యం ప్రాతఃకాలంలోలేచి స్నానసంధ్యాదులు ముగించి, నియమవ్రత పరాయణులయి పరబ్రహ్మను ఆరాధించేవారు. అయితే వారికి కొంత ధనసంపద ఉంది. ఆ ధనంలో తనవంతు తనకు పంచిపెట్టమన్నాడు సుప్రతీకుడు.

అన్న విభాసుడు!

'తమ్ముడూ! ప్రలోభంపుట్టినవారు సంపదలు పంచుకుంటారు. మనం అన్నదమ్ములం. మనకు లోభంపనికిరాదు. పైగా ధనవ్యామోహంవల్ల ద్వేషం పెరిగి కలహాలు వస్తాయి. అప్పుడు ఇరుగు పొరుగులు పరిష్కారం చెయ్యడానికివచ్చి ఈ భేదభావాలు రెచ్చగొడతారు: అందు వల్ల మనం సర్వనాశనం అవుతాం. కనక పంపకాలమాట ఎప్పుడూ మనస్సులోకి రానివ్వకు. ఇంటి పెద్దకొడుకు తండ్రితో సమానం. నువ్వు నా బిడ్డవంటివాడవు' అని సముదాయించ బోయాడు.

సుప్రతీకుడు వినలేదు. ఏమయినాసరే పంపకాలు జరిగి తీరా లన్నాడు.

అంతలో విభాసుడికి ఆగ్రహం వచ్చి —

'అన్నగారి మాటమీద గౌరవంలేకుండా ఉన్న నువ్వు మహారణ్యంలో ఏనుగు గర్భానపడి, గజజన్మఎత్తు' అని శపించాడు.

సుప్రతీకుడు మరింతకోపంతో — 'అదే అరణ్యంలో చెరువులో తాబేలువై పుడతావు నువ్వు' అని శపించాడు.

ఇద్దరూ పవిత్రమానవ శరీరాలు విడిచి జంతువు లయ్యారు. అది మొదలుగా ఆ ఏనుగు గట్టుమీదనిలిచి ఘీంకరిస్తుంది. తాబేలూ నీటిమీద తేలి అలలు రేపుతుంది. యుద్ధం ఆరంభ మవుతుంది.

అలా అవి నిర్విరామంగా పోరాడుకుంటున్నాయి ఆ చెరువులో.

ఆ ఏనుగు ఎత్తు ఆరు యోజనాలు, పొడవు పన్నెండు యోజనాలు.

తాబేలు చుట్టుకొలత పది యోజనాలు, మందం మూడు యోజనాలు.

ఈ రెండు జంతువుల సంగ్రామంలో ఆ సరోవరం, దాని పరిసర వనం గగ్గోలయి పోతున్నాయి.

ఆ చెరువులో నీరు తాగడానికి అవకాశం లేదు.

ఆ వనంలో ఏ మృగమూ హాయిగా ఆహారం తీసుకు తిరగడానికి అవకాశంలేదు.

ఆ రెండుజంతువులనూ నువ్వు ఆహారంగా తీసుకుంటే అప్పుడు ఆ చెరువూ, వనమూ, మరికొన్ని ప్రాణులకు ఆధారమవుతాయి. ఆ ప్రాంతములో పక్షులూ, జంతువులూ స్వేచ్ఛగా తిని, తాగి, తిరుగుతాయి. వెళ్ళు, నీకు శుభం" అని తండ్రి ఆశీర్వదించాడు,

గరుత్మంతుడు తండ్రికి నమస్కారంచేసి సెలవు తీసుకున్నాడు.

ఒకసారి ఆకాశానికి ఎగిరి, సరాసరి ఆ సరోవర ప్రాంతానికి వచ్చి చూశాడు.

తొండం ఎత్తి ఏనుగు ఘీంకరిస్తున్నది. తాబేలు అలలు రేపుతున్నది.

ఒక్కపూపులో క్రిందికిదిగి గరుత్మంతుడు ఒక కాలిగోళ్ళకు తాబేలును తగిలించి, రెండవ కాలిగోళ్ళతో ఏనుగును అందుకుని విశాలమైన పర్వత శిఖరానికి పోయి హాయిగా ఆరగించాడు.

ఈ విధంగా ఆ అన్నదమ్ములపోరు ముగిసింది.

ఈ కథను విన్నవారే దీర్ఘకాలంసాగే పోటీలనూ, పోరాటాలనూ గజకచ్ఛపసంగ్రామంతో పోలుస్తూంటారు.

# చిరంజీవులు

( అరణ్యపర్వంలో మార్కండేయుడు చెప్పిన కథ యిది )

పాండవులు అరణ్యవాసం చేస్తున్న రోజులలో వారికి మార్కం డేయ ముని దర్శనభాగ్యం లభించింది.

ఆయనకు అర్ఘ్యపాద్యాలిచ్చి పూజించారు. కుశల ప్రశ్నలు సాగినవి. పాండవులవంటి ధర్మపరులకు కలిగిన క్లేశాలకు ఆయన కొంత సేపు విచారించి, యింతకంటె దుఃఖాల పాలయిన శ్రీరామచంద్రుల కథ, నలదమయంతుల కథ వివరంగా చెప్పి కొంత ఓదార్పు కలిగించాడు.

అలా వారికి ఏవేవో పురాతన రాజవంశాల గాథలూ, మహర్షుల విశేషాలూ చెపుతున్నాడు.

ఒకనాడు ధర్మరాజు వినయంగా, చేతులు జోడించి:

'మహర్షీ! నా కొక ప్రశ్న వచ్చింది' అని అడగడానికి సంకోచించాడు. మార్కండేయుడు చిరునవ్వు నవ్వి:

'తెలియని విషయాలు తెలుసుకోవడం దోషం కాదు నాయనా! నీ సందేహం ఏమిటి, అడుగు' అన్నాడు.

'మహామునీ! మాకు తెలిసినంత వరకూ మీరే చిరంజీవులు. మీరు కాక మరెవరయినా చిరంజీవు లున్నారా' అని అడిగాడు.

మార్కండేయ ముని చిరునవ్వుతో, తన తెల్లని పండు గడ్డం సవరించి, 'ధర్మనందనా! మంచి ప్రశ్న అడిగావు. తప్పకుండా తెలుసుకో దగ్గది. సావధానంగా విను'.

ప్రాచీన కాలంలో ఇంద్రద్యుమ్నుడనే పేరుగల మహారాజు ఉండే వాడు. ఆయన ఎన్నెన్నో దానాలు చేశాడు. ప్రపంచంలో అంతటి ధర్మ పురుషుడు లేడని ఖ్యాతి పొందాడు. రాజర్షిగా పేరుపొంది ప్రజలందరి మన్ననలూ పొందిన ఆ పుణ్య పురుషుడు కాలం చెల్లగానే స్వర్గం చేరాడు.

అక్కడ కొన్ని సంవత్సరాలు గడిచాయి. అప్పటికి ఆ మహారాజు పుణ్య కర్మలతో సాధించుకున్న ఫలం పూర్తిగా అయిపోయిందని క్రిందికి పంపేశారు.

భూలోకానికి వస్తుండగా నేను కనిపించాను. కనిపించగానే నన్ను చూచి: 'మహర్షీ! మీరు నన్ను ఎరుగుదురా!' అని అడిగాడు.

అప్పటికి నేను చిరకాలంగా తీర్థయాత్రలతో, పుణ్యకర్మలతో, ఉప వాస వ్రతంతో కృశించి ఉన్నాను. అందుచేత 'నాకు గుర్తులేదయ్యా' అన్నాను.

'స్వామీ! మీకంటె ముందు పుట్టిన ప్రాణి ఏదయినా జీవించి ఉన్నదా!' అని అడిగాడు.

'హిమాలయ పర్వత ప్రాంతంలో ప్రావారకర్ణం అనే పేరు గల గుడ్లగూబ ఉంది అది నాకంటె పెద్దది. కొంచెం శ్రమ పడితే దానిని చూడగలవు,' అన్నాను.

'ఇంద్రద్యుమ్నుడు నన్ను వెంటబెట్టుకుని హిమాలయానికి వచ్చి ఆ గుడ్లగూబను చేరి: 'నువ్వు నన్ను ఎరుగుదువా!' అన్నాడు. తెలి యదని తల ఊపింది, ఆ పక్షి. 'అయితే నీకంటె ముందు పుట్టిన వారిని ఎవరి నయినా ఎరుగుదువా!' అని అడిగాడు.

'అయ్యా! ఇక్కడకు యోజనాల దూరంలో ఒక సరోవరం ఉంది. దానిని ఇంద్రద్యుమ్న సరోవరం అని పిలుస్తారు. ఆ కొలనులో నాడీ జంఘమనే పేరు గల కొంగ ఉంటుంది. అది నా కంటె పెద్దది,' అంది.

ముగ్గురూ కలిసి ఆ చెరువు దగ్గరకు చేరారు. ఆ మహారాజు మామూలు ప్రశ్న అడిగాడు. అప్పుడా కొంగ:

'ఈ కొలనులోనే అకూపారం అనే పేరు గల తాబేలు ఉంది. అది నా కంటె ముందు పుట్టింది', అని జవాబిచ్చింది.

అకూపారాన్ని పిలిచి యిదే ప్రశ్న వేయగా, అది కన్నీరు విడుస్తూ:

'అయ్యా! ఆయన వెయ్యి మారులు యజ్ఞం చేసి వెయ్యి యూప స్తంభాలు వేయించాడు. ఆయన దానం చేసిన గోవుల రాకపోకలతో భూమి దిగబడి యింత పరోవరం అయింది. ఇది ఆయన చలవ', అంది.

ఆ క్షణంలో దేవతలు ఆయనను స్వర్గం తీసుకు వెళ్ళారు. అంటే మన కీర్తి భూలోకంలో ఉన్నంత కాలం మనం స్వర్గంలో ఉంటాం.



## ధర్మపరులను పరాభవించ వద్దు

(ఈ కథ అరణ్యపర్వంలో ఉంది)

పాండవులు జూదంలో ఓడిపోయి, అడవులకు వచ్చారు. వారితో పాటు ఎందరో వేదవిదులు కూడా అనుసరించి రాగా, వీరందరి పోషణ భారం ఎలా నిర్వహించగలనా అని ధర్మరాజు విచారంలో మునిగాడు.

అప్పుడు వారి పురోహితుడు ధౌమ్యుడు:

'ధర్మనందనా! రాజవంశీయుడు తనను ఆశ్రయించిన వారికి అన్నపానాలు సమకూర్చి వారి యోగక్షేమాలు చూసుకుంటూ ఉండాలి. మీ ప్రాచీను లంఏరూ ఈ ధర్మ నిర్వహణ సాగించారు. తపస్సుతో, యోగశక్తితో వారు తమ ప్రజలకు ఈ రక్షణ సాగించారు.

అంతకంటే ముఖ్యాంశం ఉంది:

ఈ సృష్టి ప్రారంభం వేళ జీవకోటి అంతా ఆకలి బాధతో కటకట లాడుతుంటే అది చూసిన సూర్యభగవానుడు తాను ఉత్తరంగా పయనించి భూమిలోని సారాన్ని గ్రహించి, అనంతరం దక్షిణంగా తిరుగుతూ ఆ సారాన్ని మళ్ళీ భూమికి అందిచ్చేవాడు. అదే సమయంలో చంద్రుడు మేఘ రూపంలో ఉన్న సూర్యతేజస్సును వర్షంగా మార్చి, ఆ జలధారలతో ఓషధులను అందించేవాడు. ఆ ఓషధులలోని ఆరు రసాలూ షడ్రుచులుగా జీవకోటికి ఆహారం అయాయి.

అంటే సర్వ జీవకోటికి వెలుగునిచ్చే సూర్యుడే అన్నదాత. ఆయనను ప్రార్థించి నీ కోరిక నెరవేర్చుకో' అన్నాడు.

పురోహితుల ఆదేశానుసారం ధర్మరాజు అరుణోదయానికి లేచి గంగా తీరానికి వెళ్ళి, స్నానం చేసి పవిత్ర హృదయంతో సూర్యుని ఆరాధించాడు.

ఆ నిర్మల హృదయుని తపోదీక్షకు సంతోషించి సూర్యుడు ప్రసన్నుడై వాని కోరిక ప్రకారం ఒక తామ్ర పాత్ర యిచ్చి:

'ధర్మనందనా! ఇది అక్షయ పాత్ర. ఎందరి కయినా ఇది అన్న పానాలు సమకూరుస్తుంది. అయితే, నీ భార్య పాంచాలి భోజనం చేసి, ఈ పాత్రను పరిశుద్ధం చేసిన అనంతరం ఆ పూటకు మరి భోజనం రాదు. అంటే అతిథి పూజలు పూర్తి చేసే వరకూ, ఆవిడ భుజించదు కదా! అందు చేత నీ కోరిక తీరింది. ఇది తీసుకు వెళ్లు' అన్నాడు.

అపరిమితానందంతో ధర్మరాజు తిరిగి వచ్చి, ఆనాటి నుండి తనతో వచ్చిన వారికే కాక, అతిథి అభ్యాగతులకు కూడా అన్నదానం చేసి కీర్తి పొందుతున్నాడు.

ఈ కబురు విన్నాడు దుర్యోధనుడు.

ఆ సమయానికే అక్కడకు చేరిన దుర్వాసమహర్షిని ఆరాధించి పాండవులను ఏ విధంగా నయినా పరాభవించాలని కోరాడు.

దుర్వాస మునీంద్రుడు అంగీకరించి బయలుదేరి వచ్చాడు.

విషయం తెలిసిన వాడు కనుక పాండవులూ, పాంచాలీ కూడా భోజనం చేశాక వారిని చేరి, కుశల ప్రశ్నలు ముగించి:

'నా శిష్యులతో పాటు నాకు ఆతిథ్యం యివ్వాలి అన్నాడు.

ధర్మరాజు సంతోషంతో ఆ వార్త పాంచాలికి చెప్పాడు.

వంట యిల్లు కడుగుతున్న ఆ ఇల్లాలి గుండె గతుక్కుమంది.

'నదీస్నానం చేసి రాగలం. ఈ లోపున సర్వం సన్నద్ధం కావాలి' అని పలికి మునీంద్రుడు వెళ్ళాడు.

ద్రుపద రాజనందన రెండు చేతులూ జోడించి వాసుదేవుని ప్రార్థించింది. నిర్మల చిత్తంతో ఆమె ధ్యానించే సరికి దీనజన శరణ్యుడైన వాసుదేవుడు చిరునవ్వుతో ప్రత్యక్షమై:

'అమ్మాయీ! ఈ నాటి శాక పాకాలలో ఏ లేశమైనా ఉంటే నా చేతిలో వెయ్యి' అన్నాడు.

'అక్షయ పాత్ర కూడా శుద్ధి చేశాను. కృష్ణా! ఎందుకీ పరీక్ష!' అంది.

'కాదమ్మా! నా మాట విని ఒక్క మారు ఆ పాత్రలోకి చూడు, అన్నాడు.

ఆయన మాట కాదనలేక, అక్షయ పాత్రలో చెయ్యి పెట్టింది.

దాని అంచున ఒక అవిశ ఆకు దొరికింది. అది తీసి కృష్ణుని చేతిలో ఉంచగా ఆయన దానిని నోట ఉంచుకొని:

'ముల్లోకాలకూ తృప్తి!' అని వెళ్ళిపోయాడు.

ద్రుపద రాజనందన అతిథుల కోసం ఎదురు చూస్తున్నది. ఎంత సేపయినా వారు రావడం లేదని భీముని పంపారు.

ఇక్కడ వాసుదేవుడు 'ముల్లోకాలకూ తృప్తి' అన్న క్షణంలో దుర్వాసునికి, ఆయన శిష్యులకూ, కడుపు నిండుగా భుజించిన ఆయాసం కలిగి వారు అటే వెళ్ళిపోయారు.

నదీ తీరానికి వచ్చిన భీమునికి అక్కడి మునులు:

'నాయనా! దుర్వాసుల వారు శిష్య సమేతం స్నానం చేస్తూనే సుష్టుగా భుజించిన తృప్తితో త్రేన్పుకుంటూ వెళ్ళిపోయారు' అని చెప్పారు.

భీముడు తిరిగి వచ్చి ఆ వార్త చెప్పగా అందరూ ఆశ్చర్యపోయారు.

('ధర్మపరులను పరాభవించడానికి ప్రయత్నిస్తే ధర్మ రక్షకుడు వారినే పరాభవం పాలుచేస్తాడు, అని సూతుడు భారతకథను విని పించాడు.)

---

## భర్తను ఎలా వశం చేసుకోవాలి?

( ఈ కథ అరణ్య పర్వంలో ఉంది )

భారతంలో కూడా ఈ భామామణి ఉన్నదా! అని ఆశ్చర్య పడే వారు లక్షలకు పయిగా ఉంటారు. కాని లక్ష శ్లోకాల మహా భారతంలో ఈ సత్యభామ ఉండేది అయిదారు నిమిషాలు. ఆ కొంచెం సేపులోనే ఆవిడ మన మనస్సును పట్టుకుంటుంది. చూడండి.

శకుని ఆడిన మాయ జూదంలో ఓడిన పాండవులు అరణ్యవాసం చేస్తున్నారు. కొద్ది రోజులలో అది పూర్తి అయి అజ్ఞాత వాసానికి వెళ్ళాలి.

అటువంటి సమయంలో చుట్టపు చూపుగా వచ్చాడు వాసుదేవుడు. ఆయన వెంట సత్యభామ కూడా వచ్చింది.

అక్కడ నాలుగయిదు రోజులు గడిపారు. ఒకనాడు పాండవపత్ని ద్రౌపదీదేవి విశ్రాంతిగా ఉన్న వేళ, ఎవరూలేనిచోట, సత్యభామ ఆవిడ దగ్గరకు చేరి, కొంతసేపు లోకాభిరామాయణం అయాక –

'వదినా! ఒక్కమాట అడగాలని ఉంది. ఏమీ అనుకోకుండా, దాచుకోకుండా చెపుతావా? అంది.

ద్రుపద రాజనందన చిరునవ్వు నవ్వి:

'అదేమిటి వదినా! నీ దగ్గర దాపరికం ఏవుంటుంది నాకు', అంది.

సత్యభామ: వదినా! ఇన్ని రోజులుగా చూస్తున్నాను. ఒక్కనాడు నీ అయిదుగురు భర్తలలో ఎవ్వరూ నిన్ను పరుషంగా పలకరించడం కాని, కన్ను తెర్రజేసి చూడడం కాని కనిపించదు. అందరూ అనురాగంతో ఆప్యాయంతోనే నిన్ను చూస్తున్నారు. ఈ విద్య ఎలా సాధించావు?

ఏ మంత్రం వేస్తే, ఏ మందు పెడితే, ఏ వ్రతం చేస్తే, ఏ నదీ స్నానం చేస్తే యింతటి అనురాగాన్ని భర్తనుంచి పొందవచ్చునో చెప్పు,' అంది.

ద్రౌపదీ దేవి అంతా విని, మందహాసం చేసి

'వదినా! ఎంత అమాయకురాలివమ్మా! లోకోత్తర పురుషు డయిన మా అన్నయ్యకు భార్య వయిన నీకు ఇటువంటి ఆలోచన ఎలా వచ్చిందమ్మా! అయినా అడిగావు కనక విను.

నువ్వు చెప్పిన వ్రతాలూ, నోములూ, స్నానాలూ, మందులూ, మాకులూ, మంత్రలూ, తంత్రాలూ మనకు కాదమ్మా.

పతివ్రతా ధర్మాలు తెలియని కులటలూ, నీచులూ అటువంటి వాటి కోసం ఆలోచిస్తారు. మనమనస్సులో ఆ వెర్రి ఊహ పుట్టనే కూడదు. పుట్టినా మరుక్షణంలో దానిని పారదోలి మనస్సును పతిసేవలో లగ్నం చేసి నిర్మలంగా ఉంచుకోవాలి.

భర్తను వశపరచుకుందుకు ఈ విధంగా మందులూ, మంత్రాలూ ఉపయోగిస్తున్న సంగతి వారికి తెలిసిందంటే యింక చెప్పాలా!

పాముదూరిన యింటిని ఎలా చూస్తారో అలా చూస్తారు. వారి మనస్సు అశాంతితో నిండి, మనమీద ఉన్న ప్రేమ కూడా పోయి ద్వేషం పుడుతుంది.

ఎవరో ఏదో మందు తెచ్చి తినిపించమంటారు. దానివల్ల కొందరు మరణించారనీ, కొందరికి విపరీతంగా రోగాలు వచ్చాయనీ, మరికొందరు పిచ్చివారయి ఎందుకూ కొరగాకుండా పోయారనీ విని ఉంటావు.

ఈ మందుల వల్ల నడి వయసులోనే ముసలితనం వస్తుందనీ, కొందరికి మాట పడిపోయి మూగవారు అవుతారనీ, కొందరు చెవిటివా రయారనీ వినే ఉంటావు. అందుచేత ఆ ఆలోచన వదులుకో.

నేను ఎలా సాధించావంటావా! అది చాలా సులభం వదినా!

ముందుగా అహంకారం వదిలేశాను. దురభిమానాన్ని దూరంగా తరిమాను. సాధ్యమయినంతా పెదవి విప్పి మాట్లాడను. తప్పని సరి అయితే చిరునవ్వుతో మృదువుగా మాట్లాడుతాను. ఏనాడూ కరకుగా, పరుషంగా మాట్లాడి ఎరగను. మాటతోనే కాదుటమ్మా మనం ఎదుటివారి హృదయాన్ని జయించేది!

ఇక -

నిరంతరం వారి మనసు గ్రహించి దానికి అనుగుణంగా నడుచు కుంటాను. మాకు పరిచయం లేని కొత్తవారితో అసలు మాట్లాడను. ఎక్కడకు పడితే అక్కడకు వెళ్ళను. అనవసర విషయాలలో జోక్యం కలిగించుకోను.

వీరు ఏ పనిమీదనో అటూ ఇటూ వెళ్ళవస్తే, వారు రాగానే నవ్వుతూ ఎదురు వెళ్ళి వారిసేవ కోసం ఎదురు చూస్తాను.

వీరి అవసరాలన్నీ నేను స్వయంగా చూసుకుంటానే తప్ప, అది మా దాసదాసీజనానికి విడిచిపెట్టను.

వారు నాకు ఏ విషయం చెప్పినా అది పరమ రహస్యంగా దాచు తాను. ఎంత చిన్న విషయమయినా సరే, ఆ మాట యితరులకు చెప్పను.

ఈ యింట్లో ఎవరికి ఏది యిష్టమో నాకు తెలుసు. ఆ పదార్థాలు స్వయంగా వండి, నేనే వడ్డించి, నవ్వుతూ మాట్లాడుతూ వారి చేత హాయిగా భోజనం చేయిస్తాను.

సోమరితనాన్ని నా దరిదాపులకు రానివ్వను. మా గృహం నిత్యం పరిశుభ్రంగా కలకల లాడుతూ ఉండేలా చూసుకుంటాను.

వారితో మాటల సందర్భంలో అవసరమైతే నవ్వుతాను. అంతే తప్ప వెకిలినవ్వులు నవ్వుతూ నిలబడను.

ఇంద్ర ప్రస్థంలో యువరాజు పీఠంమీద వారిని ఎంత గౌరవంతో చూశానో, యీ వనవాసంలో కూడా అలానే చూస్తున్నాను. ఆ రోజులలో మా అత్తగారు కుంతీదేవి ఎవరితో ఎలా ఉండేవారో నేనూ అలానే నడుపుతున్నాను. ఏనాడూ ఆవిడమాటకు ఎదురు చెప్పలేదు.

తెల తెల వారు తూండగా నిద్రలేచి, నిర్మల మయిన మనస్సుతో నా పనులు నేనే చేసుకుంటాను. అక్కడ ఉన్న రోజులలో మా దాసదాసీ జనం యొక్క కష్టసుఖాలు స్వయంగా చూసుకునేదాన్ని.

అంతేకాదు, మా రాజభవనంలో వేదవేత్తలూ, వారి శిష్యులూ ఉండేవారు. అందరి భోజనభాజనాలూ సరిగ్గా సాగుతున్నదీ లేనిదీ

చూసే పని ఎప్పుడూ మరిచిపోలేదు. అందరూ సుఖంగా నిద్రించే వరకూ నేను పడక గదిలో కాలు పెట్టను.

మా కోశాగారంలో ఎంత ఉన్నది, అది ఎలా వ్యయమవుతున్నది నాకు తెలుసు. ఆదాయం - వ్యయం ఎలా ఉంటున్నాయో చూసుకునే పని నాదే.

పని పాటా లేకుండా ఎవరి యింటికీ వెళ్ళకూడదు. అనవసరంగా కాలక్షేపానికి చేరి వారినీ వీరినీ నిందించే వారిని దరిజేర నివ్వరాదు.

మరొక ముఖ్య విషయం –

కన్న కొడుకుతో అయినా సరే ఏకాంతంగా పురుషుంతో ఉండ కూడదు, భర్తతో తప్ప.

ఎప్పుడూ చిరునవ్వులో, పూలుముడిచిన జుట్టుతో, పరిశుభ్రమయిన వస్త్రాలు ధరించి, అలంకారాలతో, భర్తసేవకోసం ఎదురు చూస్తూ ఉండాలి. మన బంధువులలో వీరికి దగ్గర వారెవరో, శత్రువు లెవరో, స్నేహితు లెవరో తెలుసుకుని వారి వారికి తగినట్టు నడుచుకోవాలి.

నిత్యం సంతోషంతో ఉండాలి. అసంతృప్తి అనేది కలలోకికూడా రాకూడదు.

ఈ సూత్రాలు ఆచరించిననాడు ఎటువంటి భర్త అయినా భార్య మీద అనురాగం వర్షిస్తూ ప్రాణ సఖిగా చూసుకుని సుఖపెట్టి సుఖం పొందుతాడు వదినా!

ఇవన్నీ నీకు తెలుసు. కాని నేను ఎలా ఉంటున్నానో చెప్పానంతే! అంది ద్రౌపదీ దేవి.



## విదురనీతి పాటించి సుఖించండి

(ఈ కథ ఉద్యోగపర్వంలో ఉంది.)

వెళ్ళాడు.

వచ్చాడు సంజయుడు.

శుష్కప్రియాలతో వెళ్ళి, శూన్యహస్తాలతో తిరిగివచ్చాడు. వస్తూనే ధృతరాష్ట్రమహారాజును దర్శించి, రాయబారం విఫలమయిందని, విశేషా లన్నీ మరునటి ఉదయం మహాసభలో కురు, గురు, వృద్ధబాంధవమంత్రి, సామంత, దండనాథులందరూ ఉండగా వివరంగా చెపుతానని స్వగృహా నికి వెళ్ళాడు.

సంజయుడు వెళ్ళడంతో మహారాజు మనసు మథనపడసాగింది. కుటుంబకలహం ఏ పరిణామాలకు దారితీస్తుందోఅనే ఆందోళనతో ఆ వృద్ధ రాజు హృదయంలో కల్లోలం పుట్టింది. రాత్రికి రాత్రి మనశ్శాంతి కలిగించే ప్రియవాక్యాలు వింటూ నిద్రపోదామని మహామంత్రి విదురునికి కబురు చేశాడు. కౌరవసామ్రాజ్యానికి నిండుగౌరవంతెచ్చే మంత్రి పదవిని నిరా డంబరంగా నిర్వహించే నిరహంకారుడు, నిశ్చలమనస్కుడైన విదురుడు మహారాజు పిలుపును రాత్రివేళ అందుకోవడంఅదే మొదటి సారి.

మొదటిసారే అయినా ఆ ధీవిశారదుడు నిశ్చలచిత్తంతో రాజమంది రానికి విచ్చేసి తనరాకను ద్వారపాలకునిద్వారా మహారాజుకి తెలియ జేశాడు.

తక్షణం లోపలకు రమ్మని అనుజ్ఞ అయింది.

విదురుడువచ్చి నమస్కరించి, రాజాజ్ఞానుసారం ఆసీను డయ్యాడు. అప్పుడు ధృతరాష్ట్రుడు తనకు నిద్ర పట్టటంలేదనీ, హృదయానికి శాంతి కలిగించేమాటలు చెప్పవలసిందనీ అడిగాడు.

'మహారాజా! మీకు నిద్రపట్టడంలేదంటే నాకు చిత్రంగాఉంది. బలవంతునితో విరోధంతెచ్చుకున్న దుర్బలులకూ, ఇతరుల సంపదను హరించినవారికీ, కామంపెచ్చు పెరిగినవారికీ, దొంగలకూమాత్రమే రాత్రి

నిద్రపట్టదని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. ఈ లక్షణాలన్నీ మీకున్నట్లు నే నెరుగుదును. అటువంటప్పుడు మీకు నిద్రపట్టకపోవడానికి కారణం ఏమిటో నా కవగాహన కావడంలేదు'.

అని ఎదురుప్రశ్న వేయడంతో ధృతరాష్ట్రుడు కొంచెం చికాగ్గా - 'నేను నీ ముఖంనుండి ధర్మప్రవచనమే కోరుతున్నాను' అన్నాడు.

'మహారాజా! ఉత్తమగుణాలూ, ఉన్నతాశయాలూ, ఉదాత్త ధర్మాలూకల ధర్మరాజు త్రిలోకాధీశుడు కాగలడు. కాగలిగినశక్తి ఉన్నా ఆ కుంతీసుతుడు మీ మాటకెన్నడూ ఎదురు చెప్పలేదు. అయినా మీరు వారిని కారడవులకు పంపారు. మీకు బుద్ధిలేదనీ, ధర్మజ్ఞులుగారనీ అనలేం. అయినా వారిని అనుసరించేవృష్టి మీకు లోపించింది. వారికి రావలసిన రాజ్యభాగంకూడా వార కివ్వలేని స్థితిలో ఉన్నారు మీరు.

దుర్యోధన, దుశ్శాసన, శకుని, కర్ణాది అయోగ్యులపై అపరిమిత మైన విశ్వాసం ఉంచి ఈ సామ్రాజ్యభారం అంతా వారిచేతులలో ఉంచారు.

అలా ఉంచి శాంతిని వాంఛించడం వివేకమా మహారాజా?

సాత్త్విక స్వభావమూ, ఉద్యోగయత్నమూ, క్లేశసహనమూ, ధర్మబద్ధ దృష్టికల పురుషుడు ఎన్నడూ వంచితుడుకాడు. ఇటువంటి విద్వాంసులు దుష్టులకు దూరంగా ఉంటారు. మహారాజా! ధర్మార్థాలను అనుసరిస్తూ, లోకవ్యవహారం గ్రహిస్తూ, భోగచింతలేకుండా పురుషార్థాలు సేవిస్తూ, అప్రస్తుతప్రసంగాలు చెయ్యకుండా, దుర్లభాలు వాంఛించ కుండా, పోయినవాటికోసం శోకించకుండా, ఎటువంటి విపత్తులువచ్చినా, ధైర్యంకోల్పోకుండా, ప్రారంభించిన పనిని నిర్విఘ్నంగా పరిసమాప్తం చెయ్యనిదే విడువకుండా, సోమరితనాన్ని దరికిరానివ్వకుండా, మనస్సును స్వాధీనంలో ఉంచుకోగలవాడే విద్వాంసుడు.

ఆదరిస్తే ఆనందిస్తూ, అనాదరానికి ఆగ్రహం పొందడం విద్వాంసుల లక్షణంకాదు. వారిహృదయం గంభీరంగా గంగానది సదృశంగా ఉంటుంది. విద్వాంసులబుద్ధి విద్యను అనుసరిస్తుంది. విద్య వారిబుద్ధికి

అదుపులో ఉంటుంది. విద్యా వివేకమూ, లేకుండా గర్వంతో చరించే వాడు మూర్ఖుడు. దారిద్ర్యంతో కొట్టుమిట్టాడుతూ, లేనిపోని ఆశలు పెట్టుకునేవాడూ, అంతే.

స్వీయ ధర్మం విడిచి, యితరుల మార్గాలసాగేవాడూ, స్నేహితులతో అసంబద్ధంగా చరించేవాడూ, శత్రువులతో సఖ్యంగా ఉంటూ, బలవంతునితో వైరం పెంచుకునేవాడూ, మిత్రశూన్యుడూ, ఎదుటివారు కోరకుండానే సంభాషించేవాడూ, కృతఘ్నులను విశ్వసించేవాడూ, పరులలో దోషాలే చూచేవాడూ, అకారణంగా ఆవేశానికి లొంగేవాడూ, అనర్హులకు ఉపదేశాలిచ్చేవాడూ .... వీరందరూ మూర్ఖులే ప్రభూ !

విద్యా, దానాలు ఎంత విరివిగా ఉన్నా, ఆ రెండింటితో అహంకారం లేకుండా ఉండేవాడే విద్వాంసుడు.

తనపోషణలో ఉన్నవారికి భోజనభాజనాలు సమకూర్చకుండా తన పొట్టనింపుకునేవాడు పరమమూర్ఖుడు. విషం ఉన్నదే — అది త్రాగినవానినే చంపుతుంది. వాడిమొన కలిగిన బాణం గుచ్చుకున్నవాడే యమసదనం చేరుతాడు. మరి ప్రజలో ! ....

ఈ ప్రజాసమూహం ప్రభువును పదభ్రష్టునిచేసి, పరలోకానికే పంపగలదు.

## విధి నిషేధాలు

మహారాజా !

ఏకాకిగా — అంటే ఒంటరిగా భోజనం చెయ్యకూడదు. విషమ సమస్యలు ఎదురయినప్పుడు తనకుతానై నిశ్చయాలు తీసుకోకూడదు. ఒంటరిగా ప్రయాణం చెయ్యకూడదు. అందరూ నిద్రిస్తూంటే ఒక్కడుగా మేల్కొని ఉండరాదు.

సహనశక్తి కలవారిలో అసమర్థత ఉంటుందని అంటారు. కాని, అసమర్థులలో సహనం ఉండనే ఉండదు. క్షమ కంటే బలీయమయినది లేదు. అది పురుషులకు అలంకారం కూడా.

అల్పబుద్ధులనూ, అదే పనిగా ఆలోచించే వారినీ, త్వరత్వరగా నిర్ణయాలు మార్చేవారినీ, స్తోత్ర పాఠకులనూ రహస్య సమాలోచనకు ఆహ్వానించ కూడదు.

కుటుంబంలోని వృద్ధులనూ, దారిద్ర్యంలో పడ్డ ఉన్నత కుటుంబీకులనూ, అటువంటి దశనే అనుభవించే స్నేహితులనూ, సంతాన విహీనయై, భర్తను కోల్పోయిన సోదరినీ, ఆదరించి ఆశ్రయమిచ్చి పోషించాలి.

సమయం, సందర్భం లేకుండా కోపం తెచ్చుకునేవాడూ, సేవకుల కష్ట సుఖాలతో నిమిత్తం లేకుండా వారిచేత సేవ చేయించుకునేవాడూ, వారి కృషికి తగిన వేతనాలూ, బహుమతులూ యివ్వని ప్రభువును అచిరకాలంలోనే ప్రజలు క్రిందికి దింపుతారు.

ప్రభూ! పన్నుల వసూలు చేయడంలో కూడా అధికారులు చాలా జాగరూకతతో వ్యవహరించాలి. పూలదండలు కట్టేవాడు మొక్కకి ఏ చేటు రాకుండా దాన్ని పెంచుతూనే పువ్వులు కోసేట్టు, పన్నుల వసూలు చెయ్యాలే తప్ప, బొగ్గులవ్యాపారిలా చెట్టు మొదలంటా నరకకూడదు.

గో, నారీ, విప్రజనులమీద, స్వజనంమీద శౌర్యం ప్రకటించే వారు ఆరముగ్గిన పండులా నేల కూలుతారు.

విశాల ప్రాంతంలో ఒక్కటిగా పెరిగే చెట్టు గట్టి ప్రకృతితో బలంగా పెరుగవచ్చు. కాని, ఒక్క గాలివాన విసిరిందో—మహారాజా! సమూలంగా నేలకూలి పోతుంది. అదే వృక్ష సమూహం మధ్యలో ఉంటే - అప్పుడది అంత సులభంగా గాలికి వరిగిపోదు. అందు చేతనే సజ్జనులు సంఘంగా ఉండాలనీ, వారంతా పరస్పర సహకారంతో చరించాలనీ, బుధులు చెపుతూ ఉంటారు.

ఆకాశాన్ని పిడికిటి పోటుతో వంచేద్దామనుకునే వాడూ, ఇంద్రధనుస్సును తన బాహు బలంతో వంచుదామనుకునేవాడూ, సూర్యకిరణాలను దోసిట పట్టదామనుకునే వాడూ, వీరందరూ మూర్ఖులే అంటారు స్వాయంభువమనువు.

## ప్రియం – హితం

మనకు ప్రీతికలిగే మాటలు చెప్పేవారు అయాచితంగానే అనేకులు లభిస్తారు. కాని, మన శ్రేయస్సుకోరి హితవు చెప్పేవాడు దొరకడు. ఓవేళ హితబోధ చేసే వారున్నా, వినేవా డుండడు. ధర్మదృష్టి విడువకుండా స్వామియొక్క ప్రియాప్రియాలతో నిమిత్తం లేకుండా హితవు చెప్పగలవాడే ఉత్తమ సేవకుడు.

సేవకుల జీవనభారం గ్రహించి వారికి వేతనా లివ్వకపోయినా, మంత్రులు భోగపంచితు లయినా ఆ ప్రభువు పదచ్యుతుడు కాక తప్పదు.

ప్రభువుమాట పెడచెవినిపెట్టి యితర కార్యాలలో తిరిగే సేవకుని, అహంకారంతో ప్రభువుకు ప్రతికూలంగా చరించేవానినీ, మరుక్షణమే పదవి నుండి తొలగించాలి. ప్రభువుకుగల బలాలలో బాహుబలం మొదటిదే అయినా, దాన్ని ఘనంగా భావించరాదు. ఇక రెండవ బలం ఉత్తముడయిన మంత్రి. తరువాత ధనబలం. పితృ, పితామహ ప్రాప్త మున్నదే అది సహజబలం. అన్నింటినీ మించినది బుద్ధిబలం. స్త్రీ – సౌభాగ్యశాలినీ. కనుక ఆమె గృహాలంకారం. అందుకే ఆమెను రక్షించుకోవడం పురుషుని విధి.

మహారాజా! సర్వసద్గుణ సంపన్నులూ, ధర్మ మర్మజ్ఞులూ అయిన పాండవులతో విరోధం ఉచితం కాదు. అందుచేత వారిభాగం వారికిచ్చి సంతోషించండి', అన్నాడు.

—

## వివేక మార్గంలో పోవాలి

మహా విద్వాంసుడూ, భారత వంశ సామ్రాజ్యానికి ప్రధానమంత్రి అయిన విదురుడు తన ప్రభువు అవివేకాన్ని వేలెత్తి చూపుతూ చెపుతున్నాడు.

ప్రభూ ! ధనవంతుడున్నాడే వాడు హాయిగా సుఖపడుతూ భోగమయ జీవితం గడుపుతూ తృప్తి పడకూడదు. పదిమందికి పెట్టి, పేదవారికి దాన ధర్మాలు చేస్తూండాలి. దానం చేసేటప్పుడు చిరాకుతో, విసుగుతో చెయ్యకూడదు. సంతోషంతో చేస్తే పుచ్చుకున్నవాడు కూడా ఆనందిస్తాడు. దానివల్ల మన పుణ్యం పెరుగుతుంది. అదే ధనానికి ఫలం.

వేద వేదాంగాలు చదివినవా రుంటారు. వారు నిత్యం సత్కర్మలే చేస్తూ లోక కళ్యాణం కోసం పాటుపడాలి. శాస్త్రాలు చదివిన వారందరూ అందులో చెప్పిన సదాచారాలను తాము ఆచరించి ఎదుటి వారికి బోధించాలి.

ఆత్మబలం కనక ఉన్నట్లయితే ఎన్ని విపత్తులు మీదపడ్డా తట్టుకోగలం. అది లేని నాడు ఏ చిన్న కష్టం వచ్చినా క్రుంగిపోతాం.

ద్వేషాన్ని ద్వేషంతో జయించలేము. క్రోధాన్ని శాంతంతో జయించాలి. దుష్టులను మంచి మాటలతో మరలించాలి. లోభబుద్ధి ఉంటే అది పోవడానికి దానగుణం అలవరచుకోవాలి. అసత్యాన్ని సత్యమే జయిస్తుంది.

దొంగలు, జూదరులు, సోమరిపోతులు, కాముకులు, కృతఘ్నులు, నాస్తికులు–వీరందరూ అపఖ్యాతినే పొందుతారు.

విద్యావంతుడు కానివాడి జీవితం నిరర్థకం. అలాగే సంతానం లేని దాంపత్య జీవితమూనూ.

విశ్రాంతి లేకుండా తిరిగే వారికి త్వరగా ముసలితనం వస్తుంది. పదిమంది చేత అవమానాల పాలయిన వాడి మనస్సుకి వార్ధక్యం ప్రాప్తిస్తుంది. నిరంతరం మననం చేసుకోక పోతే విద్య నిలవదు.

అన్నిటికంటె లోభం మహాచెడ్డది. ఎందుకంటే —

ఈ ప్రపంచంలో ఉండే బంగారం, మణులూ, రత్నాలూ, ధాన్యాలూ, అన్నీ లభించినా యింకా ఏదో దొరకలేదని ఏడుస్తూనే ఉంటాడు లోభి. అందువల్లనే మానవుడు ముందుగా లోభ గుణాన్ని విడిచి పెట్టాలంటారు.

సద్వివంచి పని చేసేవాడికి ఏ లోటూ రాదు. సజ్జనులతో సహవాసం చేసే వానికి అపకీర్తి రాదు. వీరిద్దరూ సర్వ సుఖాలూ పొందుతారు.

గుణవంతులను దోషులుగా ప్రచారం చెయ్యడం కంటె మరణం లేదు. ఇతరులను నిందిస్తూ కూర్చోవడం కంటె దరిద్రం లేదు.

విద్యార్థులయిన వారు సోమరితనాన్ని దరి చేర నివ్వకూడదు. వ్యామోహాలకు లొంగరాదు. మదోన్మత్తులు కాకూడదు. చపలచిత్తులు కాకూడదు. సర్వ సుఖ భోగాలలో తేలియాడే వారికి చదువు రాదు. విద్యాభ్యాస కాలంలో వినయాన్నీ, క్లేశ సహనాన్నీ అలవరచుకోవాలి. అప్పుడే విద్య అంటుతుంది.

ప్రభూ!

మరొక్క ముఖ్యమయిన మాట. సావధానంగా వినండి. ఈ శరీరం శాశ్వతం కాదు. ఆత్మ మాత్రమే నిత్యం. అందుచేత దానిని గురించే యోచన చెయ్యాలి.

ధన ధాన్య సమృద్ధమూ, రత్న మాణిక్య సంపన్నమూ అయిన ఈ భూమండలం అంతటినీ పాలించిన మహారాజు కూడా మరణానంతరం తనతో ఒక్క గడ్డి పరక కూడా పట్టుకుపోలేడు అన్నీ యిక్కడ విడిచి పోవలసిందే.

ఈ విషయం మీకు తెలియనిదని చెప్పడం లేదు. తెలిసిన వాటిని మళ్లీ గుర్తు చేసుకోవడం మన విధి.

కష్టపడి పెంచి, పోషించి, విద్యాబుద్ధులు నేర్పి, సంపదలన్నీ యిచ్చిన తండ్రి మరణిస్తే, యిన్నీ అనుభవించే ఆ కొడుకు ఏం చేస్తున్నాడు?

ఇంతసేపు ఏడ్చి, వల్లకాటికి తీసుకుపోయి బూడిద చేస్తున్నారు. అంతేగదా! ఆ తరువాత హాయిగా జీవితం సాగిస్తున్నారు. ఇదీ లోక వ్యవహారం.

ఆ మరణించిన వాడి సిరి సంపదలన్నీ బంధువులు పంచుకు తింటు న్నారు. ఆ శరీరాన్ని బూడిద చేస్తే పంచ భూతాలలో కలిసిపోతుంది.

పాతిపెడితే నక్కలూ, గ్రద్దలూ తింటున్నాయి.

పువ్వులూ, కాయలూ లేని చెట్లమీదికి పక్షులు కూడా చేరవు. అలానే మరణించిన వాడితో ఎవరూ పోరు.

ఎటొచ్చీ - వాడు చేసిన పుణ్య, పాపకర్మల ఫలం మాత్రం కూడా వెడుతుంది. కనుకనే దాన ధర్మాలూ, పుణ్యకార్యాలూ చెయ్యాలని పెద్దలు చెబుతున్నారు.

మనం చెయ్యవలసిన పనులు మనం చేసుకుంటూ పేదసాదలను ఆదరంతో చూస్తుండాలి. పతితులను రక్షించడానికి ప్రయత్నించాలి.

గురువులయందు భక్తి కలిగి శ్రద్ధతో వారి బోధలు వింటూ, వారిని సేవించుకోవాలి.

ఎప్పుడూ సత్యమే పలకాలి అసత్య భాషణానికి అవకాశం యివ్వ కూడదు.

ధనవంతులు దానధర్మాలతో త్యాగబుద్ధిని ఎలా అలవర్చుకుంటారో, అలానే బలపరాక్రమాలు కలవారు ఎదుటి వారిని హింసించడానికి దానిని వినియోగించరాదు.

దుర్బలులకు సాయపడడానికే వీరులు కృషి చెయ్యాలి.

అన్ని దానాల కంటె శ్రేష్ఠమయినది అన్నదానం.

అదే కదా ప్రాణానికి ఆధారం.

అలానే జీవితంలో ప్రధాన మయినది ధర్మ మార్గాన నడవడం.

అంతకంటె ఏమీలేదు.

## నారదుని ఉపదేశం వినండి :

(నారదుడి పేరు వినే సరికి చాలామంది ఫకాలున నవ్వుతారు. ఆయన విదూషకుడనీ, కలహ ప్రియుడనీ ఈ అభిప్రాయానికి కారణం యిటీవలి కాలపు నాటకాలు, సినిమాలు మాత్రమే. భారత, భాగవత, రామాయణాలలో కనిపించే నారదుడు దేవముని, భక్తితత్త్వవేత్త, మహాజ్ఞాని. అటువంటి మహానుభావునికి విదూషక రూపం కల్పించిన పుణ్యాత్ములకు నమస్కారం.)

మహాభారతంలో నారద మహర్షి దర్శనం మొదటిసారి సభా పర్వంలో లభిస్తుంది.

ఇంద్ర ప్రస్థంలో ధర్మరాజు మయసభా భవనంలో సింహాసనం మీద ఉండగా ఆ ఉత్సవం చూడడానికి వచ్చాడు నారదుడు.

ఆ మునీంద్రునికి ఎదురేగి స్వాగతం యిచ్చి, ఆసనంచూపి, అతిథి మర్యాదలు జరిపాడు, పాండవాగ్రజుడు.

అప్పుడా మునీంద్రుడు ఆనందంతో ఆశీర్వదించి:

'ధర్మనందనా! నిన్ను సింహాసనంమీద చూడడం సంతోషంగా ఉంది. అయితే యింతకు పూర్వం ఈ సామ్రాజ్యాన్ని పాలించిన నీ తండ్రి తాతలందరూ ఏ విధానాలు అవలంబించారో ఆ మార్గాలను విడనాడకుండా ఉంటున్నావా? నీ రాజ్యంలో ప్రజలందరినీ సమానదృష్టితో చూసుకుంటున్నావా? ధనలోభానికి లొంగి కొందరిని ప్రేమతోనూ, మరికొందరిని ద్వేషంతోనూ చూడడం లేదుకదా! అదిచాలా అనర్థాలకు దారి తీస్తుంది. చివరకు రాజుకే ముప్పు తెస్తుంది.

ఏ మానవుడయినా, ఉదయంపూట ధర్మకార్యాలు కొనసాగించాలి. మధ్యాహ్న సమయాల్లో ధన సంపాదన మార్గాలు ఆలోచించాలి. రాత్రి పూట కామభోగాలు అనుభవించాలి.

ఈ విధంగా సామాన్యులు నడవాలంటే మహారాజు వారికి మార్గ దర్శకంగా ఉండాలి.

ధనం ఉన్నదే-అది ఎక్కువయితే దురభ్యాసాలకు దారితీస్తుంది. దానికి లొంగుతున్నామంటే సర్వనాశనమే.

పగటిపూట నిద్రపోవడం, రాత్రి వేళల మేలుకొని ఉండడం అనారోగ్య కారణం.

మన మంత్రులు, కార్యనిర్వహణ దక్షులూ, నిర్మల మనస్కులూ, కుశాగ్ర బుద్ధులూ, నిస్స్వార్థ జీవనులూ అయి ఉండాలి సుమా।

ఉద్యోగాలు

వ్యక్తుల విద్య, వివేకంతో పాటు వారి శీల స్వభావాలు పరిశీలించి వారిని తగిన ఉద్యోగాలలో నియమించాలి.

అధములకూ, మధ్యములకూ ఉన్నత పదవులు ఇచ్చి, ఉత్తము లను దిగువ శ్రేణిలో ఉంచరాదు. అందువల్ల పెద్ద పదవులలో ఎక్కిం చిన వారికి బాధ్యతలు తెలియవు. క్రిందికి దిగినవారు అవమాన భారంతో ఉండి పాలనా యంత్రాంగాన్ని పాడుచేస్తారు.

మన బాధ్యతలు మనమే నిర్వర్తించాలి. అవి క్రిందివారిమీద విడిచిపెడితే వారు మనలను లోకువ చేసి మరీ క్రిందికి దింపుతారు.

నీ సేవలోని వారికి ఎప్పటి కప్పుడు జీతభత్యాలు సకాలంలో అందకపోతే వారు తిరుగుబాటు తెస్తారు. మన రక్షణకోసం, త్యాగాలు చేసే వారి పోషణ విషయంలో చాలా శ్రద్ధ చూపాలి. అలా దేశ ప్రజా రక్షణ కార్యంలో ప్రాణాలు బలిపెట్టినవా రుంటారు. వారి కుటుంబ పోషణ అంతా మనమే భరించాలి.

అలా చెయ్యకపోతే మళ్ళీ ఏ సేనాపతీ మన కోసం సాహసించడు. దేశ రక్షణ పాడయిపోతుంది. కనక సేనలోని వారి పోషణ ప్రధాన కర్తవ్యం.

మరొక ముఖ్యాంశం.

మన కొలువులో ఎందరో ఉద్యోగులుంటారు. వారిలో కొందరే మేధావులు. వీరు తమ ప్రతిభతో మనకు పేరు ప్రతిష్ఠలు తెస్తారు. అటు వంటి వారికి పెద్ద పెద్ద పదవులు యిస్తూండాలి. అంతే కాని అలాగే ఉంచితే వారి ఉత్సాహం సన్నగిల్లుతుంది. దానివల్ల రాజ్యానికి ముప్పూ, అపఖ్యాతి.

అలానే దేశంలో అద్భుత సాహస కార్యాలు చేసేవారూ, మహా విద్వాంసులూ ఉంటారు. వారిని ఘనంగా సన్మానించాలి. విద్యావంతులూ, ప్రతిభాసంపన్నులూ అయినవారు ఎప్పుడూ కొద్దిమందే ఉంటారు.

అటువంటి వాళ్ళు దేశానికి అలంకారం. అందుచేత వారి పోషణ భారం ప్రభుత్వమే వహించాలి.

దేశానికి రెండు రకాల ప్రమాదా లుంటాయి. అందులో మొదటిది గాలివానలూ, అగ్ని ప్రమాదాలూ, వరదలూ; వీటివల్ల కరువు కాటకాలూ వస్తాయి. ఇవి ప్రకృతి వల్ల వచ్చే ప్రమాదాలు.

రెండవ రకం -

దేశంలో సంస్కారం లేని మూఢులు పెరుగుతుంటారు. వారిలో పశుత్వం ఎక్కువ ఉంటుంది. రాజు బలవంతుడై ధీశాలిగా ఉంటే ఈ మూఢులు మూల మూలల్లో బ్రతుకుతారు. అలాకాక ప్రభువుకూడా మూఢుడైతే వీరు ప్రజలను హింసించి దోచుకు తినేస్తారు. ఒక్కోసారి రాజుకే ధన లోభం పుడితే రాజు పేరుమీద వీరే దోపిడి ఆరంభిస్తారు. అందుచేత అధికారంలోకి వచ్చేవాడు ఈ మూర్ఖుల సంఖ్య పెరగకుండా చూడాలి. చూడనివాడు పదవికి నీళ్ళు వదులుకోవాలి. పైగా నేరాలు చేసేవారిని ఎప్పటి కప్పుడు కఠినంగా దండించకపోతే దేశంలో దొంగతనాలూ, దొమ్మీలూ, హత్యలూ పెరిగిపోతాయి. ఏ సమయంలోనూ ద్రోహులను దండించకుండా విడువరాదు. విద్రోహుల మీద కనికరం చూపటం కంటె తెలివితక్కువ పని లేదని మర్చిపోవద్దు. ఈ సంగతి నువ్వు వినే ఉంటావు ధర్మనందనా!

దేశ ప్రజలకు అగ్ని ప్రమాదాల బాధ రాకుండా రాజు కాపాడాలి. అలానే వారి ఆరోగ్యానికి అవసరమైన సదుపాయాలూ, చక్కని మంచి నీరు దొరికే ఏర్పాట్లు ప్రభువే చెయ్యాలి.

దేశంలో వికలాంగులూ, అనాథులూ ఉంటారు. వీరందరి రక్షణ, పోషణలూ ప్రభువే చూడాలి.

చివరగా ప్రజలనుంచి పన్నులు వసూలు చేసి వారిని సరయిన వారినే వెయ్యాలి. మంచి గంధపు చెట్లను కట్టెల కోసం కొడిచే మూర్ఖుల వలె పన్నులు పిండరాదు. పూలమాల కట్టేవాడు పూల తీగ కందకుండా పూలు కోసుకునేటట్లు మనం పన్నులు వసూలు చేసుకోవాలి.

దేశ దేశాల నుంచి మన దేశానికి వ్యాపారంకోసం వర్తకులు వస్తారు. వారిని పీడించి అధికంగా పన్నులు గుంజితే వారు మళ్ళీరారు. అలాకాక వారు పన్నులు ఎగగొట్టకుండా కూడా జాగ్రత్త పడాలి సుమా!

దేహం ఆరోగ్యంగా ఉండాలంటే శుచిగా వండిన ఆహారం మితంగా తీసుకోవాలి. దేహారోగ్యంతోపాటే మనస్సుకూడా నిర్మలంగా ఉండా లంటే అనుభవ సంపన్నులయిన విద్వాంసులతో, సత్పురుషులతో రోజూ కొంతసేపు సత్కాలక్షేపాలు చెయ్యాలి.

ధర్మనందనా! ఇవన్నీ నీకు తెలుసు. అయినా చెప్పడం మా విధి అన్నాడు నారదుడు.

---

## కలియుగం

[అయిదువేల సంవత్సరాల క్రితమే వ్యాసమునీంద్రుడు ఆధునిక కాలాన్ని ఎలా ఊహించాడో చదివితే ఆయన దూరదృష్టి వివేకవంతులకు ఆశ్చర్యం కలిగిస్తుంది, కనక సావధానంగా చిత్తగించండి.]

అరణ్యవాసం సాగిస్తున్న రోజులలో పాండురాజ నందనులకు మార్కండేయ మహామునీంద్రుని దర్శన భాగ్యం లభించింది.

ఆ చిరంజీవి వారికి ఎన్నెన్నో విశేషాలు, కథలు చెపుతూ తాను ఒకానొకప్పుడు చూసిన కలియుగం ఎలా ఉన్నదో వివరిస్తున్నాడు.

" ధర్మనందనా !

కృతయుగంలో రాజు ఉండడు. సేనలు ఉండవు. ఎందుకంటే ఆ యుగంలో అందరూ ధర్మపరాయణులు, సత్యవాక్పాలకులు, అహింసా వ్రతదీక్షితులు. అటువంటి సమయంలో సేనలూ, రాజులూ అవసరం లేదు.

త్రేతాయుగంలో సత్య, ధర్మాలకు కొంత హాని జరుగుతుంది. ధర్మం మూడు పాదాలే ఉంటుంది. అందువల్ల రాజు, సేన ఏర్పడుతాయి.

ద్వాపర యుగంలో సగం మంది అధర్మ పరాయణులే. ఈ యుగాంత వేళకే కలియుగ లక్షణాలు కూడా ప్రవేశిస్తాయి. అయినా ద్వాపరయుగంలో ధర్మానికే విజయం. సత్యవ్రత పరిపాలకులే ప్రభువు అవుతారు.

### ఇక కలియుగం

ఈ కలికాలంలో ఎవడు బాగా మోసం చెయ్యగలడో వాడు సింహాసనం ఎక్కి అధికారం చెలాయిస్తాడు.

అటువంటి వారు అధికారులయినప్పుడు వివేక వంతులకూ, జ్ఞానులకూ స్థానం ఉండదు. అందువల్ల అవివేకులూ, జ్ఞానశూన్యులూ ఉపదేశాలిస్తూ ధన సంపాదన ఆరంభిస్తారు.

వేదాధ్యయనమూ, వత్రక్రతువులూ సాగించి వరబ్రహ్మను ఆరాధించుకోవలసిన విప్రవరులు ఆ రెండూ విడిచి అన్ని రకాల పానీయాలూ సేవిస్తూ, రకరకాల ఆహారాల కోసం ఎగబడతారు. లోకానికి సన్మార్గం చూపవలసిన వీరే యిటువంటి దురాచారాలకూ, దుర్వ్యసనాలకూ లొంగితే వీరి ననుసరించవలసిన వారు ఏమవుతారో వేరే చెప్పాలా!

అసత్యవాదులూ, అల్పాయుర్దాయం కలవారూ పుడుతుంటారు. అంతేకాదు, ఇప్పటివలె ఆజానుబాహులూ, తాళప్రమాణదేహులూ పుట్టరు. మరుగుజ్జులు ఎక్కువవుతారు. నేల ఉసిరిచెట్టుకి నిచ్చెన వేసి ఎక్కవలసిన అంగుష్ఠమాత్ర శరీరాలవారు పెరుగుతారు. వీరికి కామవాంఛ ఎక్కువ. అందుకోసం మద్యపానం విరివిగా సాగిస్తారు. మరో విచిత్రం:

ఆహార పదార్థాలలో రుచిఉండదు. అన్నీ ఎండుగడ్డిలా ఉంటాయి. అసలు వీరి నాలుకకు రుచి తెలియదు, దొరికిన పదార్థం తినడమే.

అంతకన్న ఆశ్చర్యం ఏమిటంటే –

సుగంధ ద్రవ్యాలకు సువాసన ఉండదు.

ఆ యుగంలో మనుషులకు పదహారేళ్ళు రాకుండానే జుట్టు తెల్లబడిపోతుంది.

ఏడెనిమిది సంవత్సరాల వయసుకే కన్యలు గర్భవతులవుతారయ్యా!

మానవుడి పూర్ణాయుర్దాయం ఎంత ఉంటుందో తెలుసా!

పదహారేళ్ళు! అంతే!

అప్పటికే అన్నీ తీరిపోతాయి.

మత్స్యమాంసాలు తిననివారు కనిపించరు.

దానితో మద్యపానం విలాసంగా తయారవుతుంది. జూదరులు వాడవాడలా పెరుగుతారు. ఇవన్నీ ఘనకార్యాలుగా భావిస్తారు.

ఏ రోజు తెల్లవారి లేచినా –

హత్యలూ, దొమ్మీలూ, దోపిడీలు యివే కనిపిస్తాయి. వీటిని గురించే చెప్పుకుంటారు.

గోళ్ళూ, వెంట్రుకలూ విపరీతంగా పెంచుకుని రాజవీథులలో తిరిగే వారి సంఖ్య ఎక్కువగా ఉంటుంది. అటువంటి రోజులలో నాస్తికులు కూడా ప్రబలుతారు కదా! అది ఒక వ్యాపారంగా బ్రతుకుతారు వీరు.

బోసీ మనుషులు ఎలా తయారయితే ఏం? అనుకుంటే - వీరు తమ అవసరం కోసం వేళాపాళా లేకుండా ఎప్పుడు పడితే అప్పుడు ఆవుల పాలు పితకడం వల్ల అవి అనారోగ్యంతో మరణిస్తాయి. గో సంపద క్షీణిస్తుంది.

గోవుల పాలే కరువయ్యా! మానవులకు అమృతం. అది లేకుండా చేసుకుంటారు కలియుగ మానవులు.

ఆ సమయంలో అధికారులందరూ జలగలు రక్తం పీల్చినట్లు ప్రజలను హింసించి పన్నులు పిండుతారే తప్ప వారి రక్షణ విషయం చూడనే చూడరు.

పాపిష్ఠి డబ్బు కోసం అన్నదమ్ములు ఒకరినొకరు చంపుకుంటారు. తండ్రిని కొడుకు మన్నించడు. భర్తను భార్య ఎదిరిస్తుంది. జనపనార వంటి వానితో తయారయిన వస్త్రాలు ధరించి తిరుగుతారు.

కన్యాదానాలు, వివాహాలూ ఉండవు. వయసు వచ్చిన ఆడపిల్లలు తమకు నచ్చిన యిద్దరు ముగ్గురు యువకులతో హాయిగా విహారాలు సాగిస్తారు. అదే దాంపత్యం.

శ్మశానాలలో దూరంగా ఉండవలసిన ఎముకలు తెచ్చి రకరకాల బొమ్మలు చేసి గృహాలలో అలంకరించి సంతోషిస్తారు.

ధర్మనందనా!

ఇప్పుడు విద్య నేర్చుకునే వాడికి అన్నం పెట్టి, నీడయిచ్చి, విద్య నేర్పి, ఆశ్రమాలు చూస్తున్నావు. అలానే ఆకలితో కడుపు చేతబట్టి గుమ్మంలో నిలిచి 'దేహి' అన్న పిలుపు వినబడితే ఆదరంతో అన్నదానం చేసే సంసారులు కనిపిస్తున్నారు.

కలియుగంలో అన్నదానం, విద్యాదానం ఉండవు. అన్నాహారాలు అమ్ముకుంటారు. విద్యకూడా వ్యాపార వస్తువే అవుతుంది.

అన్నవిక్రయం, విద్యావిక్రయం ఆరంభించాక యింక ఏం జరుగుతుందో ఊహించలేవు.

అలా కొంతకాలం కలియుగం గడిచాక అమావాస్య రాకుండానే సూర్యగ్రహణం, పూర్ణిమ ప్రవేశించకుండా చంద్రగ్రహణం ఏర్పడతాయి.

ప్రజలకు పచ్చని పొలాలూ, తోటలూ ఉండే నదీ తీరాలలోని పల్లెల మీద మనసు విరిగిపోయి పట్టణాలకు చేరుతారు. అందరికీ నగరవాస వ్యామోహమే। పల్లెలు నిర్జనప్రాంతా లవుతాయి. పంటలు నశిస్తాయి.

యుగాంత సమయంలో ఝంఝూమారుతం రేగుతుంది. అది నిర్విరామంగా సాగుతుంది.

ఏడుగురు సూర్యులు ఉదయిస్తారు. భగభగలాడుతూ అగ్నిజ్వాలలు. అలా గడిచాక అంతా బూడిద అవుతుంది.

అప్పుడు కుండపోతగా కొంత కాలం వాన కురుస్తూనే ఉంటుంది. అది యుగసంధి.

నెమ్మదిగా ఈ భీభత్సాలు చల్లారుతాయి. రవి, గురు, చంద్రులు ఒకేసారి కర్కాటకంలో ప్రవేశిస్తారు.

కాలానికి అవసరంగా వానలు, ఎండలు ఉంటాయి. భూమి పచ్చ పచ్చని చెట్లతో, లతలతో, ఫల, పుష్ప భరితం అవుతుంది.

ప్రజలు జరా రోగపీడలు లేకుండా అన్నదాన, విద్యాదానాది సత్కార్యాలతో సుఖంగా ఉంటారు". అది కృతయుగం

అన్నాడు మార్కండేయుడు.

---

## మేనక

(బ్రహ్మర్షి విశ్వామిత్రుడు రామాయణంలో చాలాముఖ్యమయిన పాత్ర నిర్వహిస్తాడు. భారతంలో విశ్వామిత్రుడు బ్రహ్మర్షి కావడానికి తపోదీక్షలో ఉండగా కనిపిస్తాడు. అదికూడా శకుంతలకథలో ఒక సన్నివేశంలో ఈయన దర్శనంలభిస్తుంది: ప్రస్తుతకథ ఆదిపర్వంలోనిది.)

వసిష్ఠమహర్షితో వచ్చిన వైరంకారణంగా, ఆయనవలె బ్రహ్మర్షి కావాలనేకోరికతో విశ్వామిత్రుడు తీవ్రనియమాలతో తపస్సు చేస్తున్నాడు.

దేవేంద్రుడు ఆ తపోదీక్షకు భయపడి ఏ విధంగానయినా దానికి భంగం కలిగించాలని బాగా ఆలోచించి, ఆలోచించి ఏ మానవుడయినా కామినీ, కాంచనాలకు దాసు డవుతాడని నిశ్చయించుకున్నాడు.

ధనంకంటే మనిషిని సుందరీమణులే మరింతగా వంచించగలరని భావించి, అప్సరసలకు తలమానికమయిన మేనకను పిలిపించి:

'అప్సరోజనశిరోమణీ!

ఇప్పుడు నువ్వొక దేవకార్యం సాధించవలసిఉంది. నా వజ్రాయుధం పనిచెయ్యనిచోట్ల నీ కంటిచూపులు తీవ్రంగా పనిచేస్తాయని మేమెరుగుదుము. ఆ శక్తిని ప్రయోగించి కార్యం సాధించాలి.

విశ్వామిత్రమహర్షిపేరు విని ఉంటావు. ఆయన గాధిరాజ నందనుడు. రాజభోగాలన్నీ అనుభవించి, వసిష్ఠులవారితో యుద్ధానికిపోయి, ఆ బ్రహ్మవేత్తముందు ఆగలేక రాజశక్తికంటె బ్రహ్మవిదులశక్తి ఘనమయినదని గ్రహించి, దానిని సాధించడానికి తీవ్రంగా తపస్సు చేస్తున్నాడు. అదిమాకు సంతాపం కలిగిస్తున్నది. ఆయన దీక్షకు భంగం కలిగించడం సామాన్యవిషయంకాదు. ఆయన శక్తికూడా అసాధారణమయినది.

అయినా నీ రూపం, లావణ్యంగా, నాట్య విద్యా ప్రావీణ్యం వీటితో ఆయన తపస్సమాధికి భంగం కలిగించాలి' అన్నాడు.

ఆ మాటలు వింటున్న మేనక శరీరం ఆపాదమస్తకం కంపించింది. గుండె నిబ్బరం తగ్గింది.

'ప్రభూ! మీమాటకు ఏనాడూ ఎదురు చెప్పకుండా తలవంచి వెళ్ళి పనులు చేసుకువచ్చాం. కాని, విశ్వామిత్రులవారి పేరు వింటేనే మాకు గుండె దద్దరిల్లుతున్నది.

ఆయన సామర్థ్యం మీ రెరుగనిదికాదు. ఆయన తపస్సు, తేజస్సు ఎంతటివో అంతకంటె పదిరెట్లు ఆయనకు క్రోధం. దీనికేకదా మీరు భయ పడుతున్నారు! మీరే భయభ్రాంతులయేచోట మా గతి ఏం కావాలి!

వసిష్ఠులవారి కొడుకు లందరినీ సంహరించిన క్రోధమూర్తి ఆయన. తపస్సుకి అంతరాయం కలగకుండా తన ఆశ్రమ సమీపంలో నదిని ప్రవ హింపజేసుకున్న శక్తిశాలి. మాతంగునిచేత యజ్ఞం చేయించినప్పుడు మీరు స్వయంగా వెళ్ళి సోమపానం చెయ్యక తప్పలేదు. వసిష్ఠులవారు శపించిన త్రిశంకునిచేత యజ్ఞంచేయించి, ఆయనకోసం త్రిశంకు స్వర్గం నిర్మించాడు.

ఆయన కన్నులెర్రజేస్తే ముల్లోకాలూ భస్మం అవుతాయి. కోపంతో భూమిమీద తన్నితే భూగోళం గజ గజ వణుకుతుంది. మేరు పర్వతాన్ని గడ్డి పరకలా చూడగలడు. అంతటి మహామహుని దగ్గరకు నన్ను వెళ్ళ మంటున్నారు.

నేను వెడతాను. అంతకుముందు ఆయన ఉన్న వనం అంతా వసంతశోభతో, మలయపవనాలతో, సుగంధ సౌరభంతో అలరారు తుండాలి. నేను ఆ మహర్షి ఎదుటకు వెడుతున్నప్పుడు వాయువు నా పైట చెరగును ఎగరవేసుకు పోవాలి.

ఇన్నిటితోపాటు మన్మథుడు జాగరూకతతో తన పనిని కొనసాగిం చాలి. అప్పుడు మీ శాసనాన్ని నేను సక్రమంగా పాలించగలుగు తాను" అంది.

దేవేంద్రుడు చిరునవ్వుతో అన్నిటికీ అంగీకరించి పంపించాడు.

మేనక అమరావతి విడిచి విశ్వామిత్రుని తపోవన వాటికకు వచ్చింది.

అప్పటికే ఆశ్రమ పరిసరాలలో లతలు మొగ్గ తొడిగాయి. చెట్లు పూలతోనిండి సువాసన లీనుతున్నాయి. గాలి చల్లగా వీచుతున్నది.

పక్షులన్నీ అనురాగంతో ఒకదానినొకటి ముక్కులతో ముద్దులాడు కుంటున్నాయి.

అటువంటి సమయంలో ఆశ్రమ సమీపాన తపోదీక్షలో ఉన్న విశ్వామిత్రునికి అల్లంతదూరంలో నిలబడి, అభినయంతో చేతులు జోడించింది మేనక.

ఆమె చేతిగాజులు, కాలిఅందెలమువ్వలు కదలి సన్న సన్నగా ధ్వని చేస్తూ ఆ మహర్షి చెవులలో చేరుతున్నాయి.

ఆయన మెల్ల మెల్లగా కన్నులుతెరిచే వేళకు ఆమె అంజలి బంధంతో నాట్యం చేస్తున్నది. సరిగ్గా అదే సమయానికి గాలి విసురుతో ఆమె పైట కండువా ఎగిరి దూరంగా పడింది.

కన్నులు విప్పిచూశాడు విశ్వామిత్రుడు.

చూస్తున్న విశ్వామిత్రుడు తపస్వి.

చూసిన విశ్వామిత్రుని దీక్ష సడలింది.

నెమ్మదిగా లేచాడు.

ఆమె సిగ్గుతో వెనుదిరిగి పైటకండువాకోసం అడుగులువేస్తూ వెను దిరిగి చూస్తున్నది.

కనులు మిలమిలలాడిస్తున్నది.

గాలి మరింత రేగింది.

ఆమె పరికిణీ చక్రంలా తిరిగి పైకి లేచింది.

విశ్వామిత్రుని మనస్సు వివశమయింది.

తన స్వాధీనం తప్పిన మనస్సులో కామవికారం పుట్టింది.

కామక్రోధాలను జయించి బ్రహ్మర్షిపదం చేరాలనే పట్టుదలతో మానవ సంచారం లేని మహారణ్యంలో తపస్సు చేసుకుంటూ కూర్చున్న విశ్వామిత్రుడు ఆ వనంలో ఏకాంతంలో పైటజారిన సుందరిమణి కనిపించే సరికి సర్వమూ మరిచిపోయి మనసులో మదనతాపం రేగగా మేనకను చేరబిలిచాడు.

మేనక సిగ్గుతో, భయపడుతూన్నట్లు రాజహంసలా నెమ్మదిగా అడుగులో అడుగువేస్తూ ఆయనను సమీపించింది.

విశ్వామిత్రుడు ఆమెను దగ్గరగా తీసుకున్నాడు.

పది సంవత్సరాల కాలం గడిచింది.

అంతా ఒక నిమేషంలా అనిపించింది, ఆ విశ్వామిత్రునికి.

అప్పటికి మేనక గర్భవతి అయింది.

ప్రసవ కాలం సమీపిస్తున్నది.

నాటికి తెలిసింది, విశ్వామిత్రునికి

ఏమని ?

తను కామాన్ని జయించలేదని.

అంతే మేనకను విడిచి ఉత్తరాభిముఖంగా వెళ్ళిపోయాడు, తపో దీక్షతో.

మేనక ప్రసవించి శిశువును మాలినీ నదీతీరాన ఒక చెట్టు క్రింద వదలి దేవలోకం చేరుకుంది.

ఆ అమ్మాయి పేరే శకుంతల.

(ఎంతటి మహామహులయినా ఒంటరిగ ఉన్నప్పుడు స్త్రీలను చేర నిస్తే పతనం తప్పదని నీతి)



## సౌఖ్యం లేని ప్రేమ కష్టాన్ని కలిగిస్తుంది

మేనకా, విశ్వామిత్రులు ఎవరి దారిని వారు వెళ్ళారు. ఒక చెట్టు నీడలో శకుంతములు (పక్షులు) పోషిస్తున్నాయి పసిపాపను.

అటువైపు నదీస్నానానికి వచ్చాడు కణ్వమహర్షి. ఆయన కంట పడింది ఆ పాప. ఆమెను రెండు చేతులలోనికి తీసుకుని తన ఆశ్రమానికి తెచ్చి పెంచుతున్నాడు.

శకుంతములు (పక్షులు) పోషించిన కారణంగా ఆమెకు శకుంతల అని పేరుపెట్టాడు.

ఆమె పెరిగి పెద్దదవుతున్నది.

చక్కనిచుక్కలా, అప్పుడే విరిసిన పువ్వులా పదహారేళ్ళప్రాయంతో శకుంతల ఆశ్రమంలో తిరుగుతూ కణ్వమహర్షిని కన్నతండ్రిలా సేవించు కుంటున్నది.

అలా రోజులు గడుస్తూండగా ఒకనాడు దుష్యంతమహారాజు ఆ అర ణ్యానికి వేటకు వచ్చాడు. వేట సాగుతుండగా ఆ మహారాజు కణ్వమహర్షి ఆశ్రమ ప్రాంతం చేరాడు.

సమీపంలో మహర్షి ఆశ్రమం కనిపించగానే పరివారాన్ని దూరంగా ఉంచి, ఒంటరిగా ఆశ్రమంలో అడుగుపెట్టాడు.

ఎంతటి మహారాజయినా, ఆ రోజులలో వేదవిదులను, ముసు లను, మహర్షులను అప్పుడప్పుడు స్వయంగా వెళ్ళి దర్శించి, వారి ఆశీ ర్వాదాలు పొందే సంప్రదాయం ఉండేది.

ఆ భావంతోనే ఆశ్రమ పరిసరాలలోని ప్రశాంత వాతావరణానికి భంగం కలగకుండా సేననూ, పరివారాన్ని దూరంగా ఉంచి వచ్చాడు.

ఆశ్రమం దగ్గర ఎవరూ కనబడలేదు. కొంచెం లోపలకు నడిచాడు. ఎదురుగా శకుంతల కనిపించింది.

ఆమె శరీర లావణ్యం, అవయవ శోభ మహారాజు మనస్సును ఆకర్షించాయి.

మహారాజును చూస్తూనే ఆమె అతిథిమర్యాదలు జరిపింది. ఇరువురూ కుశలప్రశ్నలు వేసుకున్నారు.

అప్పుడు శకుంతల:

'ఆర్యా! తమరు మా ఆశ్రమానికి ఏ పనిమీద దయచేశారో సెలవిస్తారా' అంది.

'పద్మముఖీ!

నేను అవిల మహారాజు కుమారుడను. నన్ను దుష్యంతుడని పిలుస్తారు. మహాఋషి కణ్వులవారిని దర్శించి వారి ఆశీర్వాదం పొంది వెళ్ళాలని వచ్చాను. వారు కనిపించలేదు', అన్నాడు దుష్యంతుడు.

శకుంతల: మహారాజా! మా పితృపాదులు ఫలాలు తేవడానికి వెళ్ళారు. మీరు కొంచెం విశ్రాంతి తీసుకొనేలోగా వస్తారు.

దుష్యంతుడు: ఓ లావణ్యలహరి! చూడగానే నన్ను ఆకర్షించిన నీ గురించి తెలుసుకోవాలని ఉంది. ఈ అరణ్యంలో ఆశ్రమాలలో ఉండవలసిన అవసరం నీ కెందుకు కలిగింది? నువ్వెవరి బిడ్డవు? ఈ ప్రశ్నలు ఎందుకడుగుతున్నానంటే కణ్వమహర్షి ఇంద్రియాలను జయించి తపోదీక్షలో ఉన్నారని విన్నాం. ఆయనకు సంతానం కలిగే అవకాశం లేదు. నిన్ను నా భార్యగా గ్రహించి రాజ్యానికి తీసుకువెళ్ళి పట్టమహిషిని చేయాలని ఉంది.

శకుంతల: ఆర్యా! కణ్వమహర్షి నాకు గురువులు. వారి అనుమతి లేనిదే నేను స్వతంత్రించి ఏ పనీ చెయ్యను. వారు రాగానే మీరు వారిని అడగండి.

దుష్యంతుడు: అతిలోకసుందరీ! బ్రహ్మచర్య వ్రతనిష్ఠలో ఉండే కణ్వమహర్షికి సంతానం ఎలా కలిగింది?

శకుంతల: మహారాజా! నేను మేనకా–విశ్వామిత్రుల బిడ్డను. నన్ను చిన్ననాటి నుంచీ పెంచి పెద్ద చేసిన వీరే నాకు తండ్రివంటివారు.

దుష్యంతుడు: విశ్వామిత్రుని పుత్రికవయిన నువ్వు రాజ వంశానికి చెందిన దానవు కనక, రాజులకు ఉచితమయిన గాంధర్వ వివాహం మనం చేసుకోవచ్చు. దానికి ఒకరి అనుమతి అవసరం లేదు.

శకుంతల: మహారాజా! గాంధర్వం ధర్మబద్ధమయితే నేను మిమ్ము పెళ్ళి చేసుకుంటాను. కాని ఒక నియమం ఉంది. మీవల్ల నాకు కలిగిన కుమారుడు మీ రాజ్యానికి చక్రవర్తి కావాలి.

అంగీకరించాడు దుష్యంతుడు.

ఇద్దరూ కొంతసేపు సుఖించారు.

దుష్యంతుడు ఆమెను అనునయించి రాజధానికి వెళ్ళగానే చతురంగ బలాలను పంపి మహారాణిగా తీసుకు వెడతానన్నాడు.

దుష్యంతుడు వెళ్ళిన కొద్దిసేపటికి కణ్వమహర్షి వచ్చాడు. సిగ్గుతో, భయంతో ఉన్న శకుంతల ఆయనకు యథాప్రకారం ఎదురుగా వెళ్ళి నమస్కరించి, చిరునవ్వుతో స్వాగతం పలక లేదు.

కణ్వమహర్షి ఆమెనుచూసి 'అమ్మా! ఆశీర్వాదం. ఏం జరిగింది తల్లీ! నిర్భయంగా చెప్పు' అన్నాడు.

'పితృపూజ్య! దుష్యంత మహారాజు మన ఆశ్రమానికి వచ్చారు. ఆయనను నేను భర్తగా స్వీకరించాను. అనంతర కథ మీరు గ్రహించ గలరు' అంది శకుంతల.

కణ్వమహర్షి ప్రసన్న వదనంతో:

'అమ్మా! చాలా సంతోషం. అనురాగ తరంగిత హృదయులయిన మీరు ఏర్పరచుకున్న సంబంధం క్షత్రియులకు తగినదే. దీనినే గాంధర్వం అంటారు. యోగ్యుడయిన భర్తను పొందావు.

అందువల్ల నీవు ధర్మాత్ముడూ, మహా బలిష్ఠుడూ అయిన కుమారుని కని కీర్తి పొందుతావు. నీ పుత్రుడు సర్వశత్రు సంహారం చేసి భూమండలాన్ని పరిపాలించగలడు,' అని ఆశీర్వదించాడు.

రోజులు గడుస్తున్నాయి. నెలలు దాటుతున్నాయి.

మహారాజు నుండి కబురు లేదు. శకుంతల మనసంతా దుష్యంతుని మీదనే ఉన్నది. ఆకలి వెయ్యడం లేదు. పరిశుభ్రంగా స్నానం చెయ్యా అనిపించడం లేదు. ఏ పూట కాపూట రాజధాని నుండి రథం వస్తుందని ఎదురు చూస్తున్నది.

ఈలోగా నెలలు నిండి ఒకానొక శుభ ముహూర్తంలో ఆమె ప్రసవించింది.

కణ్వమహర్షి ఆ బాలుడికి జాతక కర్మ జరిపించాడు.

బాలుడు పెరుగుతున్నాడు. వాని చేతులలో చక్రాలు చక్రవర్తి లక్షణాలని నలుగురు అంటూంటే ఉప్పొంగేది శకుంతలలోని మాతృ హృదయం. ఆరేడు సంవత్సరాల వయసు వచ్చేసరికి ఆ బాలుడు సింహంవలె పరాక్రమించి, ఆశ్రమ పరిసరాలకు వచ్చే పెద్దపులులనూ, సింహాలనూ, మదగజాలనూ చెవులు పట్టి ఆడించే వాడు.

అది చూసి అక్కడి మునులు వానికి సర్వదమనుడు అని పేరు పెట్టారు.

పెరుగుతూ ఉన్న బాలునికి రాజవంశ సంప్రదాయానుసారం అన్ని విద్యలూ నేర్పుతున్నాడు కణ్వమహర్షి.

పన్నెండు సంవత్సరాలు గడిచిపోయాయి.

అప్పుడొకనాడు కణ్వమహర్షి :

'అమ్మా! ఇంతవరకూ మహారాజు కబురు పంపలేదు. ఇప్పుడు నీ కొడుకు యువరాజు పదవి అలంకరించవలసిన వయసులో ఉన్నాడు. ఎంతటి పతివ్రతయినా చిరకాలం పుట్టింట ఉండకూడదు. భర్త దగ్గరే కష్టమయినా, సుఖమయినా అనుభవించడం భార్యకు ధర్మం,' అని ఆమె కుమారుని దగ్గరగా తీసుకుని.

'నాయనా! చంద్రవంశీయుడయిన దుష్యంత మహారాజు నీ తండ్రి. నువ్వు మీ అమ్మతో అక్కడకు వెళ్ళి యువరాజు పదవిని ధర్మ దీక్షతో నిర్వహించాలి' అని తన శిష్యులను పిలిచి.

'నాయనలారా! వీరిద్దరినీ తీసుకు వెళ్ళి దుష్యంతమహారాజు దగ్గర విడిచి రండి', అన్నాడు.

ప్రయాణ సన్నద్ధురాలై శకుంతల ఆయన పాదాలకు అభివాదం చేసింది.

బ్రహ్మచర్య దీక్షితుడూ, తపస్సంపన్నుడూ అయిన కణ్వమహా మునికి కన్నీరాగలేదు.

పెంచిన ప్రేమ నిండిన గుండెలో బాధ పుట్టింది. కంటనీరు ఒలికింది. గద్గద స్వరంతో:

'లోకమంటే ఏమిటో ఎరగని ఈ అమాయకురాలిమీద దేవతలందరూ దయ చూపాలి!' అని ఆశీర్వదించి పంపాడు.

శకుంతల తన కుమారుడైన భరతుని (సర్వదమనుని ముద్దుపేరు) వెంట పెట్టుకుని దుష్యంతుని దగ్గరకు బయలుదేరింది.

అరణ్యం దాటి రాజధాని చేరి దుష్యంతుని కోటలో ఆయన కొలువులో శకుంతలనూ, భరతునీ విడిచి కణ్వుని శిష్యులు తరలి వెళ్ళారు.

దుష్యంత మహారాజు సభా భవనంలో సింహాసనం మీద ఉన్నాడు. మంత్రి, సామంత, దండనాథులతో విద్వాంసులు కూడా ఆ సభలో ఉచితాసనాల మీద అలరారుతున్నారు.

అప్పుడు వచ్చిన శకుంతల, తన కుమారుడయిన భరతుని భుజం మీద చెయ్యివేసి:

'నాయనా! సత్య ధర్మ పరాయణుడైన ఈ మహారాజు మీనాన్నగారు. ఆయనకు నమస్కరించు,' అని తనుకూడా చేతులు జోడించింది.

కుమారుడు భరతుడు సంతోషంతో ఆశగా తండ్రి వైపు చూశాడు.

దుష్యంతుడు: ఓ తరుణీ! నీ బిడ్డను తీసుకుని ఏ ప్రయోజనం కోరి వచ్చావో అడుగు!

శకుంతల : మహారాజా ! వీడు మీ కుమారుడు. అలనాడు మీరు వేటకు వచ్చి కణ్వాశ్రమంలో గాంధర్వవిధిని నన్ను వివాహం చేసుకునే ముందు నా బిడ్డకు యువరాజు పదవి యిస్తామన్నారు. ఆ మాట నిలబెట్టుకోవలసిన భారం మీ మీద ఉంది.

దుష్యంతుడు : ఓ మూర్ఖురాలా ! నువ్వెవరివి ? నిన్ను నే నెప్పుడూ చూడలేదు. ఇటువంటి అసందర్భపు ప్రలాపాలు కట్టిపెట్టి బయటికి నడు.

శకుంతల : మహారాజా ! మీరు నన్ను చూడనేలేదా ? గుర్తు తెచ్చుకోండి. పన్నెండేళ్ళ క్రితం వేటకువచ్చి మాలినీ నది తీరాన కణ్వ మహర్షి ఆశ్రమం దగ్గర నన్ను కలిసి మీ రాడిన మాటలు మరవకండి. పంచ భూతాలూ, సూర్య చంద్రులూ, అంతరాత్మ-ఇవన్నీ మనం చేసే ప్రతి పనికీ సాక్షులు. వాటి కన్ను గప్పి ఎవరూ ఏమీ చెయ్యలేరు.

ఇప్పుడు నేను స్వయంగా వచ్చాను కనక మీరు తిరస్కారభావంతో చూస్తున్నారు. మీ సభలో నా మాటలు అరణ్యరోదనంలా ఉన్నాయి. ఒక్కటి మరువకండి. పురుషుడు పుత్ర రూపంలో భార్యాగర్భంలో ప్రవేశించి పితృదేవతలను ఉద్ధరిస్తాడు. పున్నామ నరకంనుంచి కుమారుని వల్లనే బయటపడతాడు. భార్య అనేది తండ్రివలె పురుషుని హితవు కోరుతుంది. తల్లివలె ఓరిమితో ఓదారుస్తుంది. మిత్రుని వలె సాయపడుతుంది. లోకంలో ఎవరయినా భార్య కలవానినే విశ్వసిస్తారు. వివాహం కానివాడు ఎంత ధనవంతుడయినా ఆ సంపద, అడవికాసిన వెన్నెల. ఇన్ని విధాల తోడునీడగా ఉండాలి కనకనే భార్యను ఎన్నుకునేటప్పుడు రూపంతోపాటు గుణం, గుణంతో శీలం, శీలంతో సంప్రదాయ పదాచారాలు చూచుకుంటారు పెద్దలు.

పోగా -

భార్యగర్భం నుంచి ప్రభవించిన బాలుడు సర్వ విధాలా తండ్రిని పోలి ఉంటాడు. అద్దంలో ప్రతి బింబంలా కుమారునిలో తండ్రి రూపం

సాక్షాత్కరిస్తుంది. అందువల్లనే పుత్రోదయ, దర్శనాలు తండ్రికి ఆహ్లాదం కలిగిస్తాయి.

దేశ భ్రష్టులయి, దుర్భర దారిద్ర్యం అనుభవించే వారయినా భార్య దగ్గర ఉంటే ఆ కష్టాలు మరచిపోతారు. అందువల్లనే భార్యను అనాదరంతో, ఆగ్రహంతో బాధించరాదు అని వివేకవంతులు చెపుతున్నారు.

మహారాజా! అంతకంటె ప్రధాన ధర్మం ఉంది.

అది పుత్ర వాత్సల్యం.

పసితనంలో ఎక్కడ పడితే అక్కడ పాకుతూ, దుమ్ములో దొర్లుతూ, అల్లంత దూరంలో తండ్రి కనిపించే సరికి కిలకిల నవ్వుతూ వచ్చి రెండు కాళ్ళూ చుట్టివేసుకుని ఆశగా చూసే కొడుకుకంటె ఆనందం కలిగించే విషయం మరొకటి ఉన్నదా?

నామాట మీకు ఎంత చేదుగా ఉన్నా ఈ మీ కుమారుని వైపు చూడండి. మీ ఒడిలో కూర్చుని యువరాజు ఠీవిని ఒలికించాలనే కోరిక వీడి కన్నులలో మీకు కనిపిస్తుంది.

చిన్న చిన్న చీమల నుంచి పక్షులు, పశువులు తమ సంతానం మీద ఎంతో ప్రేమతో ఉంటాయి. తన గూటిలో ఉన్న కోకిల గుడ్లను కూడా కాకి అమాయకంగా తన సంతానమే అని సాకి పొదుగుచున్నది.

అది ఎరిగిన మీరు మీ కుమారుని విషయంలో అనాదరం చూపడం న్యాయం కాదు.

సామాన్య మానవుడు కూడా తిరిగి తిరిగి యింటికి రాగానే తన బిడ్డలను దగ్గరగా తీసుకుని ముద్దులాడి పొంగిపోతాడు.

మరొక మాట:

తన బిడ్డకు "జాతక కర్మ" జరుపుతూ

"అంగాదంగాత్

సంభవసి........"

నా ప్రతి అవయవం నుంచి నువు జన్మించావు. నా హృదయంలో నువ్వే. నా ఆత్మ నువ్వు. అటువంటి నువ్వు నూరేళ్ళు సుఖంగా బ్రతుకు అంటాడు.

చూడండి నిర్మలమయిన కొలనిలో ప్రతిబింబంలా వీడు మూర్తులా మిమ్ము పోలి ఉన్నాడు-

అని అలా శకుంతల చెప్పుతు పోతున్నది.

దుష్యంతుడు కదలకుండా పెదవి మెదపకుండా కూర్చున్నాడు.

'మహారాజా! రాజ కార్యాలలో మునిగి తేలే మీకు అన్ని విషయాలూ గుర్తుండవు.

పన్నెండేళ్ళ క్రితం:

వేటకోసం అడవికి వచ్చారు.

మీ బాణానికి అందక పరుగెత్తే లేడికోసం తిరుగుతూ మా ఆశ్రమంలో ప్రవేశించి గాంధర్వ విధానాన నన్ను పెళ్ళి చేసుకున్నారు.

అప్సరో భామలలో అగ్రశ్రేణికి చెందిన మేనక నా తల్లి.

తేజోవంతుడూ, తపస్వీ అయిన విశ్వామిత్రులవారు నా జనకులు.

నన్ను పెంచిన జనకుడు బ్రహ్మర్షి కణ్వులు.

అటువంటి ఉత్తమురాలి నయిన నన్ను తియ్య తియ్యని మాటలతో పరిగ్రహించారు. అనాటి మన సమాగ ఫలం ఈ బాలుడు,

విశ్వరక్షకులైన మీరు నా ప్రాణ నాథులు. ధర్మ పరులయిన మీరు నన్ను మోసం చెయ్యకండి.

చిన్నవాడే నా తలిదండ్రులు నన్ను వదిలేశారు. ఇప్పుడు నా ప్రాణ నాథులయిన మీరు కూడా తిరస్కరిస్తున్నారు. కష్టాలు నాకు కొత్తకాదు. కాని ఈ బాలుడు మాత్రం మీ కుమారుడే' అని నిట్టూర్చింది.

దుష్యంతుడు: శకుంతలా! సాధారణంగా అబద్ధా లాడడం ఆడవారికి సహజ గుణం. నీ మాటలు మరి నమ్మలేనంత అబద్ధాల పుట్టలు

ఎక్కడి విశ్వామిత్ర మహర్షి !

వారికి కలిగిన నువ్వు ఇలా కులటలా ప్రవర్తిస్తున్నావంటే నిన్ను నమ్మలేము. నువ్వు ఏమేమో కథలు చెపుతున్నావు. నా కసలుగుర్తు లేవు.

శకుంతల ! మహారాజా ! ధర్మ భ్రష్టులను పాముపాముతో పోలుస్తారు.

అందుకే ధర్మ హీనలకు నాస్తికులు కూడా భయపడతారు.

మహారాజా ! వందనూతులు తవ్వించడం కంటే ఒక దిగుడుబావి నిర్మించడం మంచిది. అటువంటివి నూరు నిర్మించడం కంటే ఒక సత్క్రతువు మంచిది. అవి నూరు చెయ్యడం కంటె గుణవంతుడయిన కొడుకును కనడం శ్రేష్ఠం. కుమారులు నూరుగురికంటె ఒక్క సత్య వాక్యం శ్రేయోదాయకం. సత్యమే పరమేశ్వరరూపం. అందుచేత మీరు సత్యాన్ని మరువకండి. నన్ను విడిచినా బాధలేదు. నేను వెడతాను. ఆఖరు సారిగా ఇటు వీడికన్నులలో మీ చూపుని నిలపండి. మీ కొడు కవునో కాదో తెలుస్తుంది. సరిగ్గా ఆ సమయానికి ఆ శరీరవాణి ఇలా పలికింది.

'మహారాజా ! ఈమె నీ భార్య. వీడు నీ కుమారుడు. ఆమె నిజం చెప్పింది.'

ఆ మాటలు విని దుష్యంతుడు

'సభాసదులారా !

విన్నారు కదా ధర్మ దేవత పలుకులు.

ఈమె చెప్పిందంతా నిజమే. కాని ముందుగా అంగీకరిస్తే మీ రంతా ఈ పుణ్యశీలను శంకిస్తారని ఇంతసేపు ఆగాను'

అని కొలువు చాలించి, శకుంతలా భరతులను దగ్గరగా తీసుకుని అంతఃపురానికి వెళ్ళి తన తల్లికి నమస్కరింపజేసి, విషయం వివరించి, ఆశీర్వాదాలు పొందాడు.

(భారతంలో మొదటి ప్రేమ కథ ఇది. సాక్ష్యం లేని ప్రేమ కష్టాన్ని కల్గిస్తుంది. నాడు ధర్మం రక్షించి ఉండకపోతే ఈ నాటి ప్రేమ కథే ఇది కూడా)

## జూదం తగదు

(ఈ కథ ఆదిపర్వంలో ఉంది.)

తన వలె కష్టాలపాలయిన మహామహులు చరిత్రలో ఎవరయినా ఉన్నారా అని ధర్మరాజు అడుగగా బృహదశ్వమహర్షి చెపుతున్నాడు.

"ధర్మనందనా! నిజానికి నువ్వు పడే కష్టం ఎంతటిదయ్యా! తమ్ములు నలుగురూ, నీ భార్యా నీ దగ్గర ఉన్నారు. ఈ వనాలలోని మునులూ, ఋషులూ నీకు ధర్మబోధ చేస్తూ, ఓదారుస్తూన్నారు.

ఈ మాత్రం కూడా లేకుండా భార్యకు దూరమై ఎన్నో బాధలు పడిన నలమహారాజున్నాడు. ఆయన కూడా జూదంలోనే రాజ్యం, సంపదనూ కోలుపోయి నానా యాతనలూ పడ్డాడు. ఆ కథ విను.

భారతదేశంలో ఉండే అనేక రాజ్యాలలో నిషధదేశం ఒకటి. ఆ రాజ్యాన్ని వీరసేనుడనే రాజుకొడుకు నలుడు పాలిస్తున్నాడు. ఈ నల మహారాజు సర్వసద్గుణ సంపన్నుడు, విద్యావంతుడు, రూపంలో మన్మథుడు. సత్యవ్రతంతో విద్వాంసులను పూజించే వాడు.

అయితే పాండురాజనందనా! ఆయనకు కూడా నీలానే జూదం అంటే మహా ప్రీతి. ఆ విద్యలో మంచి నేర్పు కూడా ఉంది. సరే! ఆ విషయం అలా ఉంచు.

ఆ రోజులలో విదర్భ రాజ్యాన్ని పాలించే భీముడనే రాజుకి దమయంతి అనే పేరుగల కుమార్తె ఉండేది. ఆమెకు పదహారేళ్ళు నిండే నాటికి ఆమె గుణ, శీల, సుందర రూపాలను గురించి దేశదేశాలలో చెప్పుకునే వారు.

సాధారణంగా అందం కల ఆడవారికి వినయం ఉండదు. కొందరికి శీలం ఉండదు. వినయమూ, శీలమూ లేని అందగత్తెను గురించి అందరూ ఆడిపోసుకుంటారే తప్ప మంచి మాట అనరు.

అలా కాకుండా ఈ దమయంతి తన అందం కంటె వినయ, గుణ, శీలాలతో అందరి మెప్పునూ పొందింది.

అలానే సదాచార, సద్గుణ రూపాలకు, సాహస పరాక్రమాలు తోడుగా ఉన్న నలమహారాజుకి దమయంతి తగిన ఇల్లాలు కాగలదని దేశ దేశాలు తిరిగే విద్వాంసులు అంటుండే వారు. ఈ వార్త నల దమయంతు లిద్దరి చెవిని పడింది. ఒకరినొకరు చూచుకోకుండానే వారి మధ్య అను రాగం అంకురించింది.

అలా ఉండగా, ఒకనాడు నలుడు తన ఉద్యానవనంలో విహారం సాగించే సమయంలో అక్కడ తిరిగే హంసలలో ఒక రాయంచ నలుని చేతికి చిక్కింది.

దాని అందాన్ని చూసి ఆనందించే నలునితో ఆ హంస :

'మహారాజా ! నువ్వు నన్ను విడిచిపెడితే నేను విదర్భదేశం వెళ్ళి అక్కడ దమయంతికి నీ గుణ, రూప, సాహసాలు విపరించి ఆమెకు నీ యందు అనురాగం కలిగేలా చేస్తాను', అంది.

నలుడు విడిచిపెట్టాడు.

హంస బయలు దేరి వెళ్ళి విదర్భ రాజు ఉద్యానవనంలో విహ రించే దమయంతిని సమీపించి నలుని గుణ గణాలు కీర్తించింది.

ఆ మాటలు విని దమయంతి హంసను లాలించి ఇదే విధంగా నా గురించి ఆ మహారాజుకి చెప్పవలసిందిగా ప్రార్థించింది.

హంస అలాగే అని వెళ్ళి విషయమంతా నలునికి విశదం చేసింది.

తన కుమార్తె వయసు గమనించి విదర్భరాజు స్వయంవరం ప్రక టించాడు.

ఆ స్వయంవరానికి దేశదేశాల రాజులతో పాటు దేవతలు కూడా వచ్చారు. వారు వచ్చే దారిలో నలుని చూసి, తమ పక్షాన దమయంతి దగ్గరకు రాయబారిగా పంపారు.

దేవతల అనుగ్రహం వల్ల నలుడు ఎవరికంటా పడకుండా సరాసరి దమయంతి అంతఃపురంలో ఆమె ఎదుట నిలిచాడు.

ఆ సుందరాకారుని చూసి దమయంతి ఆశ్చర్యంతో

'ఆర్యా! దివ్యసుందరాకారంతో ఉన్న మీరెవరు? ఈ అంతః పురంలోకి పోతుటీగ రావడానికి వీలులేదే! మీరెలా వచ్చారు?' అంది.

నలుడు: కల్యాణీ! నేను ఇంద్ర, వరుణ, యమ, అగ్నిహోత్రులు పంపగా వారి అనుగ్రహం వల్ల ఎవరి కంటబడక ఇక్కడకు దూతగా వచ్చాను. రేపు స్వయంవరంలో నువ్వు ఈ నలుగురిలో ఒకరిని వరించాలి.

దమయంతి! తమరెవరో చెప్పలేదు?

నలుడు: నన్ను నలుడంటారు. నిషధ చక్రవర్తిని.

దమయంతి సిగ్గుతో, ఆనందంతో తలవంచి –

'మహారాజా! నా మనసెప్పుడు మిమ్మే ప్రాణనాథునిగా వరించింది. అలనాడు హంస చెప్పిన నాటినుంచి మిమ్మే ఆరాధిస్తున్నాను. ఈ స్వయంవరం మీ కోసమే ప్రకటించారు. మీరు నా భర్త. అలా జరగని నాడు మరణమె శరణ్యం' అంది.

పరిపరివిధాల దేవతల ఘనతను గురించి చెప్పి, వారిలో ఎవరినో ఒకరిని వరించడం ఉచితం అని నలుడు ఎంత బోధించినా అంగీకరించ లేదు దమయంతి. 'దేవతా సమక్షంలోనే మిమ్ము వరిస్తాను' అంది.

నలుడు తిరిగి వచ్చి అంతా వివరించాడు.

దేవతలు ఆశవీడక మరునాడు స్వయంవర మండపానికి నలుని వేషంలో వచ్చి వాని పక్కనే కూర్చున్నారు.

దమయంతి స్వయంవర సభలో అడుగుపెట్టి ఒక్కొక్కరినే చూస్తూ నలుని సమీపించింది. అక్కడ అయిదుగురు నలమహారాజులు కనిపించగా

'ఓ దివ్యపురుషులారా! నేను ప్రేమించే నలమహారాజు మీలో ఎవరు?' అంది.

వారు నలుగురూ లేచి నిలబడ్డారు. నలుడు కదలలేదు.

అప్పుడు దమయంతి ఆ నలుగురికీ నమస్కరించి నలుని మెడలో పూలమాల వేసింది.

దేవతలు వారిని దీవించి వెళ్ళారు.

నలుడు భార్యాసహితుడై తన రాజ్యానికి వచ్చాడు.

పన్నెండు సంవత్సరాలు సుఖ సంతోషాలతో నలదమయంతులు జీవితం సాగించారు. వారికి ఇంద్రసేనుడనే కుమారుడు, ఇంద్రసేన అనే కుమార్తె కలిగారు. వారు చక్కని శిక్షణలో పెరుగుతున్నారు.

ఆ రోజులలో పొరుగు రాజయిన పుష్కరుడు నలుని దగ్గరకు వచ్చి తనతో జూదం ఆడమన్నాడు.

జూదానికి, యుద్ధానికి ఆహ్వానం వస్తే తిరస్కరించరాదు అనే నియమం కల నలుడు అంగీకరించాడు.

జూదం ఆరంభమయింది. పుష్కరుని మాయజూదంలో నలుడు ఒక్కొక్క పందెం ఓడిపోతున్నాడు.

ఓడిన కొద్దీ ఆవేశంతో పందెం పెంచుతున్నాడు. గెలిచిన ఆనందంతో పందెం కాస్తున్నాడు పుష్కరుడు. రోజులు గడుస్తున్నాయి. భర్త జూదంలో సర్వం ఓడిపోతున్నట్టు తెలిసి దమయంతి తన బిడ్డలిద్దర్నీ ఒక రథం మీద పుట్టింటికి పంపింది.

అన్ని సంపదలూ ఓడిపోయిన నలునితో పుష్కరుడు :

'ఇంక నీ దగ్గర పైసా కానులేదు. నీ భార్య ఉంది. ఆమెను కూడా పందెం కాస్తావా ?' అన్నాడు.

నలుడు దీనవదనంతో కోట దాటి వచ్చాడు. దమయంతి కూడా అనుసరించింది.

శత్రు నగరంలో ఉండరాదని రాజ్యం విడిచి వారు వెడుతున్నారు.

ప్రజలందరూ :

'జూదం ఎంత పని చేసింది ! ధర్మప్రభువయిన నలమహారాజుకి కూడా కష్టాలు తెచ్చిపెట్టింది', అని కంటనీరు పెట్టారు.

నల దమయంతు లిద్దరూ తిరిగి తిరిగి ఆహారం కూడా దొరకనిచోట మంచినీరు తాగి కాలం గడుపుతున్నారు.

అలా ఉండగా ఒకనాడు వారి సమీపంలో కొన్ని పక్షులు కని పించగా నలుడు వాటిని పట్టుకోవాలని ఉత్తరీయం వాటిమీద విసిరాడు. అవి ఆ బట్టతో సహా ఎగిరిపోయాయి. అప్పుడు భార్య పైట చెరగు సగం చింపి తన ఉత్తరీయం చేసుకున్నాడు.

కొంతదూరం నడిచి నాలుగు దారులు కలిసే ఒక కూడలిలో నిం బడి :

'దమయంతీ! ఇంతవరకూ నాతో ఎన్నో కష్టాలు అనుభవించావు. ఇప్పుడు నీకు శ్రేయోమార్గం బోధించాలని ఉంది.

ఇదిగో ఇటు దక్షిణంగా వెడితే అవంతీ దేశం చేరుతావు. అటు నుంచి కొంచెం ముందుకు వెడితే విదర్భదేశం వస్తుంది', అన్నాడు.

దమయంతి ఆ మాటలు విని కన్నీరు విడిచి 'నాథా! ఎందుకు చెపుతున్నారు నాకు ఈ దారి? రాజ్యం పోయినా, సంపదలు పోయినా కట్టుబట్ట పోయినా మిమ్మల్ని నేను విడవలేదు. మీతోనే కష్టమయినా, సుఖమయినా అనుభవించడానికి సిద్ధంగా ఉన్నాను. ఎలా అయినా మీ దుఃఖాన్ని తగ్గించడానికే నేను మీతో ఉన్నాను. నన్ను వదలకండి'- అంది.

అప్పుడు నలుడు:

'దమయంతీ! భార్యకంటె ఈ ప్రపంచంలో స్నేహితుడూ, ఆప్త బంధువూ ఎవరూ లేరు. ఈ విషయం నే నెరుగుదును. ఎరిగి నిన్ను విడిచి పెడతానని ఎందుకనుకున్నావు? ఒక వేళ నీకు నేను దూరమయినా నా మనస్సు ఎప్పుడూ నీ మీదనే ఉంటుంది. మన ప్రేమకు అంతరాయం ఉండదు' అన్నాడు.

అలా మాట్లాడుకుంటూ వారు ఒక సత్రం చేరారు. ఆ రాత్రి నిద్రి స్తున్న వేళ దమయంతిని విడవలేక విడవలేక విడిచి వెళ్ళిపోయాడు నలుడు.

తెలతెలవారు తూండగా నిద్రలేచిన దమయంతి భర్తకోసం గోలు గోలున విలపిస్తూ సత్రం విడిచి ఊరు దాటి అడవిదారి పట్టి వెదకడం ఆరంభించింది.

తిరుగుతూండగా ఓ కిరాతుడు ఆమెను చూసి మోహించి బలాత్కారం చెయ్యబోయి, ఆ పతివ్రత వేడిచూపులకు తట్టుకోలేక నేల కూలాడు.

దొరికిన పండుతిని, నీరుతాగి భర్తకోసం పిచ్చిదానిలా తిరుగుతూ చేదిదేశం చేరింది. అక్కడి జనులందరూ ఆమెను పిచ్చిదానిగా, భావించి వెంటాడుతూంటే, రాజభవనం నుంచి చూసిన రాజమాత తన దాసిని పంపి దమయంతిని రాజభవనంలోకి రప్పించింది".

దమయంతి రాజభవనంలోని అంతఃపురంలో మహారాణి నందాదేవి దగ్గరకు రాగానే ఆవిడ ఆదరంతో కూర్చుండ బెట్టింది. పరిచారిక లందరినీ దూరంగా వెళ్ళమని:

'అమ్మాయీ! ఎవరింటి బిడ్డవమ్మా! నీ భర్త ఎవరు? ఈ దశలో ఎందుకున్నావు? అలంకారాలు లేకపోయినా, జుట్టు చిందర వందరగా ఉన్నా, మాసిన బట్టలతో ఉన్నా నీలో దివ్యశోభ కనిపిస్తున్నది. సత్యం చెప్పు తల్లీ'! అని బుజ్జగింపుగా అడిగింది.

దమయంతి విచారంతో!

'మహారాణీ! నేను ఎవరి బిడ్డనని చెప్పను? ఆ కథ మరచిపోయాను. ప్రస్తుతం ఏకాకిని. సైరంధ్రీ వృత్తిలో నాకు ప్రవేశముంది. రాజాంతఃపురాలలో, నా నియమాలకు భంగం కలగనిచోట ఆ వృత్తిలో ఉంటాను.

నా భర్త గుణ, శీల రూపవంతుడు. కానీ, అన్యాయంగా జరిగిన జూదంలో అన్నీ కోలుపోయి అడవులపాలయాము. ఆయన నన్ను ఒక సత్రంలో ఒంటరిగా విడిచివెళ్ళాడు. ఆయనకోసం తిరుగుతూ తిరుగుతూ యిలా వచ్చాను. మీరు నా నియమాలకు అంగీకరిస్తే యిక్కడే ఉంటాను', అంది.

అంగీకరించింది మహారాణి.

తన కొమార్తెను పిలిచి మహారాణి అన్ని విషయాలూ చెప్పి, 'ఈమెను కంటికి రెప్పవలె చూసుకోవాలి' అంది. ఆ విధంగా దమయంతి వారి అంతఃపురంలో కాలం గడుపుతున్నది.

ఆ రాత్రి వస్త్రంలో బయలుదేరిన నలుడు ఒక మహారణ్యంలో సాగుతూండగా అక్కడ దావానలం వ్యాపించి మంటలు లేచాయి.

ఆ మంటలలో నుండి ఆర్తనాదం వినిపించింది. దీన జన రక్షణ దీక్షకల నలుడు అటు నడువగా –

'ఓ పుణ్యాత్ముడా! ఇటురా! నేను నాగజాతి కర్కోటకుడను. నారదులవారి శాపంవల్ల యిక్కడ కర్రలా పడి ఉన్నాను. నీ దర్శనంతో నాకు శాపం పోతుందని ఆయనే అన్నారు. నన్ను ఈ మంటల నుండి కాపాడితే నీకు మేలు చేస్తాను' అని కర్కోటకుడు పలుకగా నలుడు వానిని యీవలకు తెచ్చి వదిలాడు.

అపుడు కర్కోటకుడు :

'ఆర్యా! మీరు పది అడుగులు వేయండి. మీకు శుభం కలుగుతుంది', అన్నాడు.

నలుడు పదో అడుగు వెయ్యగానే కర్కోటకుడు నలుని కాటు వేశాడు. ఆ సర్పవిషం ఎక్కగానే నలుడు నల్లని మరుగుజ్జు వాడయాడు.

నలుడు తెల్లబోయిచూడగా, కర్కోటకుడు :

మహారాజా! బాధపడకు. ప్రస్తుతం నన్ను కలిపురుషుడు బాధిస్తున్నాడు. నా విషంతో వాడు మాడుతూంటాడు. అంతవరకూ నీ రూపం ఎవరికీ తెలియకుండా రహస్యంగా గడపడానికే నేను కాటువేశాను. ఇది మొదలు నీ పేరు బాహుకుడు.

ఇప్పుడు నువ్వు అయోధ్యకువెళ్ళి ఆ రాజు ఋతుపర్ణుని కొలువులో చేరు. ఆయనకు జూదం అంటే పిచ్చి. ఆయన దగ్గర ఆ విద్య గ్రహించాలంటే నీకు తెలిసిన అశ్వహృదయం ఆయనకు నేర్పాలి. దానితో మిగిలిన కార్యాలు చక్కబడతాయి.

నీకు నీ రూపం ఎప్పుడు కావాలంటే అప్పుడు నన్ను స్మరించు', అని చెప్పి మాయమయ్యాడు.

బాహుక రూపంతో నలుడు అయోధ్య చేరి, రాజును దర్శించి, తనకు అశ్వశాస్త్రం తెలుసుననీ, ద్యూతంకూడా వచ్చుననీ, వంట చెయ్యటంలో మంచి అనుభవం ఉన్నదనీ చెప్పగా, ఆ మహారాజు వానిని తన అశ్వపాలకుడుగా నియమించాడు.

అలా కాలం గడుపుతున్నాడు నలుడు, నిత్యం రాత్రి వేళల దమ యంతినే స్మరించు కుంటూ.

తన కుమార్తె దమయంతి, అల్లుడు నలమహారాజు అరణ్యాల పాలయారని విన్న విదర్భరాజు విచారంతో తన నగరంలోని విప్రవరు లను రావించి:

'వేదవిదులారా! మీరు దేశ దేశాలు తిరుగుతూ అనేక నగరాలు చూస్తుంటారు. ఎక్కడయినా నా కుమార్తె, ఆమె భర్త కనిపిస్తే ఆ వార్త నాకు అందించండి. అందుకు ప్రత్యుపకారంగా మీకు అగ్రహారం యిచ్చి వందల గోవులు సమర్పిస్తాను', అన్నాడు.

వారందరూ తమ పర్యటనలో నలదమయంతుల జాడ తెలుసు కోవడానికి ప్రయత్నాలు ఆరంభించారు.

వారిలో సుదేవుడనే విద్వాంసుడు చేది రాజ్యంచేరి, రాజు యింట శుభకార్యం జరిగే వేళ అక్కడ ఉన్న నారీమణులమధ్య దమయంతిని గుర్తుపట్టాడు.

పతి వియోగంతో, అరణ్య యాత్రల క్లేశాలతో కృశించిన దమ యంతి రాహు గ్రస్తమయిన చంద్రబింబంలా, ఎండకు వాడిపోయిన తామరపూవులా కనిపించింది.

నెమ్మదిగా వీలుచూసి ఆమెను ఏకాంతములో కలిసి, తనకథ చెప్పాడు సుదేవుడు.

దమయంతి మాట్లాడకుండా బొట బొట కన్నీరు విడిచింది. అది చూసి రాజకుమారి సునంద ఆ విషయం తన తల్లితో చెప్పింది.

రాజమాత ఆ విప్రునిచేరి వివరా లడిగింది.

ఆయన సంగతులన్నీ చెప్పి:

'మహారాణీ! చూశారా! ఈ అమ్మాయి కనుబొమలమధ్య తిలకం వలె ఒక పుట్టుమచ్చ ఉంది. అదిచూసి నేను గుర్తుపట్టాను' అనగా రాజ మాత దమయంతిని దగ్గరగా తీసుకుని:

బిడ్డా! మీ అమ్మా నేను అక్క-చెల్లెళ్ళం. నీకు ఎంతటి దురవస్థ పట్టిందమ్మా! అని విచారించింది.

కొంతసేపయాక దమయంతి:

'పిన్నీ! ఇంతకాలం నే నెవరో తెలియకపోయినా ఎంతో ఆదరంగా చూశావు. ఇప్పుడు నన్ను ఈ విద్వాంసుని వెంట మా పుట్టింటికి పంపు. అక్కడ నా బిడ్డ లిద్దరూ ఉన్నారు. వారిని చూసుకుని కొంత ఆశ్వాసం పొందుతాను' అంది.

మరునాడే దమయంతి పుట్టింటికి చేరింది. తల్లిదండ్రులు ఎంతో ఆనందించారు. కన్నబిడ్డలు తల్లిని కౌగిలించుకుని సంతోషంతో కంటనీరు పెట్టారు.

దమయంతి బిడ్డలిద్దరినీ దగ్గరగా తీసుకుని ముద్దాడి, వెన్నుదువ్వి, కన్నీరు తుడిచి, బుజ్జగించింది.

ఆ రాత్రి గడిచింది. తెల్లవారింది. మరునాడు దమయంతి తల్లితో తన భర్తను అన్వేషించే ప్రయత్నం సాగించమంది.

ఆ పనికి బయలుదేరే విద్వాంసులందరినీ రావించి దమయంతి:

'పుణ్య పురుషులారా! మీరు వెళ్ళిన ప్రతి రాజసభలోనూ యీ సందేశం వినిపించి, అందరినీ పరీక్షగాచూచి, యిది వినగానే ఎవరు చలిస్తారో వానిని గురించి వివరాలు తెలుసుకు రండి.

జూదరి అయిన ఓ ప్రాణేశ్వరా! పతిసేవకే అంకిత మయిన భార్యను నిద్రలో ఉండగా విడిచి, ఆమె చీర చెరగు కట్టుకు వెళ్ళావు. నాటి నుంచీ ఆమె అదే దశలో నిన్నే స్మరిస్తూ కృశిస్తున్నది. కనికరంతో ఆమెకు నీ దర్శనభాగ్యం అనుగ్రహించు'

అని దమయంతి వినిపించిన సందేశంతో వెళ్ళిన వారిలో అందరూ ఏ సమాచారం లేకుండానే వచ్చారు.

వారిలో సుదేవుడనే విప్రవరుడు దమయంతి దగ్గరకువచ్చి:

'అమ్మా! దేశ దేశాలు తిరిగి నేను అయోధ్యలో ఋతుపర్ణుని ఆస్థానంలో నీ సందేశం వినిపించాను. ఆ సభలో ఎవ్వరూ జవాబివ్వలేదు. కాని, సభదాటి వచ్చాక, దారిలో ఒక పురుషుడు (ఆ మహారాజుగారి అశ్వపాలకుడు, బాహుకుడని ఆయన పేరు) నేను పలికిన మాటలకు జవాబిచ్చాడు' అని చెప్పాడు.

ఒక రథం విదర్భ నగర పరిహద్దులలో ప్రవేశిస్తున్నది. ఆ వేగానికి భూమి కంపిస్తున్నది. రాతికోట గోడలు ఊగిసలాడుతున్నాయి. అంత దూరంనుంచి అంతఃపురానికి వినబడింది రథ చక్ర నేమిధ్వని.

దమయంతి గుండె పులకించింది. 'సందేహం లేదు, అది నలుని సారథ్యమే. అంత వేగంగా మరెవరూ రథాన్ని నడపలేరు,' అని నిశ్చయించింది.

ఆ ధ్వనికి విదర్భలోని గుర్రాలూ, ఏనుగులూ గజ గజ లాడి ఆకాశంలోకి తలలెత్తి చూశాయి భయంగా.

రథం కోటలోని మధ్య ప్రాకారానికి రాగానే ఆ వార్త విని విదర్భ రాజు మర్యాదగా ఎదురువచ్చి ఋతుపర్ణునికి స్వాగతం పలికి, అతిథి మర్యాదలు నడిపాడు.

నగరంలో ఎక్కడా స్వయంవర సన్నాహాలు కాని, ఆ ప్రయత్నాలు కాని కనిపించక ఋతుపర్ణుడు తెల్లబోయాడు. ఇలా స్వయంవర వార్త తనకు ఎందుకు పంపారో తెలియలేదు.

ఋతుపర్ణుడు ఎందుకు వచ్చాడో విదర్భ రాజుకు తెలియలేదు.

'మిత్ర ధర్మంగా వచ్చానన్నా' డాయన.

'సంతోషం' అన్నా డీయన.

దమయంతి తన చెలికత్తెను పిలిచి!

'కేశినీ! ఆ రథం మీద వచ్చిన పొట్టి చేతుల కురూపివున్నాడే ఆయన ఎవరో ఆయన కథ ఏమిటో వివరంగా తెలుసుకురా' అని పంపింది.

ఆమె నెమ్మదిగా రథం దగ్గరకు వెళ్ళి బాహుకుని చేరి కుశల ప్రశ్నలతో సంభాషణ మొదలుపెట్టి, సేకరించిన సమాచారంతో దమ యంతి దగ్గరకు వచ్చి!

'అమ్మా! ఆ రథం మీద వచ్చిన కురూపి ఋతుపర్ణులవారి సారథి. మనం పంపిన బ్రాహ్మణుని సందేశం విని ఏ సమాధానం యిచ్చాడో అవే మాటలు చెప్పి వినిపించాడమ్మా' అంది.

దమయంతికి అర్థమయింది ఆ వ్యక్తి నలుడే అని. అయితే ఈ వికార రూపం ఏమిటో అర్థంకాక, మరోసారి దూతికను పంపి, వాని చర్యలన్నీ పసిగట్టి రమ్మంది.

వెళ్ళిన దూతిక తిరిగి వచ్చి:

'అమ్మా! అంతా అద్భుతంగా ఉన్నదమ్మా!

మన కోటనుంచి వారికి అన్నీ వండని పదార్థాలు పంపించారు. అక్కడ వంటశాలలో నీళ్ళులేవు, నిప్పులేదు. బాహుకుడు ఒక్కసారి అక్కడున్న ఖాళీ కుండలలోకి చూడగానే అవి నీటితో నిండాయి. రెండు గడ్డి పరకలు తీసి సూర్యుని కెదురుగా ఉంచాడు. అవి మండడం ఆరం భించాయి. క్షణాలలో వంట పూర్తి అయింది.

ఆ పరిసరాలలోని మన లతానికుంజాలలో వికసించిన పువ్వులు తీసి ఆయన నలిపి పారేశాడు. ఆ చేతులలో అంత నలిగినా అవి వాడి పోకుండా అప్పుడే రేకులు విచ్చిన వాసన లీనుతున్నాయి.

అలా దూతిక చెపుతూంటే దమయంతి విశ్వాసం మరింత పెరిగి, ఆయన వండిన పదార్థాలు తీసుకు రమ్మని చెప్పింది. తెచ్చిన వంట కాల రుచిని బట్టి అది నలుని చేతి వంటయే అని గ్రహించింది.

తన బిడ్డ లిద్దరినీ యిచ్చి దూతికను నలుని దగ్గరకు పంపింది. వారిని చూస్తూనే దగ్గరకు తీసుకుని బాహుకుడు గోలు గోలున విలపించాడు.

తన పిల్లలు కూడా యిలా ముద్దుగా ఉండే వారనీ, వీరిని చూడ గానే వారు గుర్తు వచ్చి విచారించా' ననీ అన్నాడు.

ఈ కబురు విన్న దమయంతికి సందేహం పూర్తిగా తీరింది. తల్లి దగ్గరకు వెళ్ళి :

'అమ్మా! ఆయనను అంతఃపురానికి రప్పించి అసలు విషయం తెలుసుకోవాలి' అంది.

ఆవిడ మహారాజుతో సంప్రదించి బాహుకుని రప్పించింది.

దమయంతిని చూస్తూనే బాహుకుడు కంటనీరు పెట్టాడు. దుఃఖం పొంగిపొర్లింది. దమయంతి కూడా అదే దశలో పడింది కొంతసేపు యిద్దరూ దుఃఖించారు.

దమయంతి దుఃఖాన్ని దిగమ్రింగుతూ :

'బాహుకా! ఘోరారణ్యంలో భార్యను విడిచి వెళ్ళిన పురుషుని ఎక్కడయినా చూశావా? ఆమె ఏ అపరాధం చేసిందని అలా విడిచి వెళ్ళాడో కనుక్కున్నావా? దేవతలను కూడా తిరస్కరించి అనురాగంతో వరించి, సంతానవతిని అయిన నన్ను అలా ఒంటరిగా వదలి వెళ్ళడం న్యాయమనీ భావించాడా ఆయన? ధర్మార్థ కామాలు మూడూ కలిసి సాగించి, అనుభవిద్దాం అని అగ్ని సాక్షిగా వివాహం చేసుకున్న నన్ను విడవడం ధర్మమా?'

అని అడుగుతూంటే బాహుకుని కన్నుల వెంట అశ్రుధారలు కురిశాయి.

'ఓ మహాసాధ్వీ! యింకా నీ మాటల శూలాలతో నన్ను వేధించకు.

మనకు కలిగిన క్లేశాలన్నీ కలిపురుషుని పగవల్ల వచ్చినవి. ఇప్పటికి వాడు నన్ను విడిచాడు. కనుక యిక్కడకు రాగలిగాను.

అనురాగంతో ఆనందమయ జీవితం గడిపిన నారీమణి పరపురుషుని వివాహ మాడుతుందని ఊహించలేకపోయాను. మీ నాన్నగారు నీ ద్వితీయ స్వయంవరం ప్రకటించడం వల్ల మా మహారాజును తీసుకు వచ్చాను' అని రోదించాడు.

అప్పుడు దమయంతి :

'నన్ను శంకించకండి. మీ జాడ కనిపెట్టడానికి నేనే ఆ సందేశం పంపాను. నగరంలో స్వయంవర సన్నాహాలు మీకు కనబడ్డాయా? మా నాన్న గారికి కూడా మీరెందుకు వచ్చారో తెలీదు. మీరు తప్ప ఇంత దూరం రథాన్ని ఒక్కరోజులో నడపగలవారు లేరని ఎరుగుదును. నా ఊహ నిజమయింది' అంది.

బాహుకుడు కర్కోటకుని స్మరించాడు. అంతే! బాహుకుడు నలుడుగా సుందర రూపంతో సాక్షాత్కరించాడు. నలదమయంతులు ఇద్దరూ ఒకరి నొకరు గాఢంగా ఆలింగనం చేసుకున్నారు.

వాడిపోతున్న నారు మడికి తొలకరి చినుకులు పడినట్లు వారి దుఃఖభర హృదయాలు ఆనంద గగనంలో విహరించాయి. మరునాడు తెలతెల వారుతూండగా నలదమయంతులు అభ్యంగన స్నానంచేసి నూతన వస్త్రాలు ధరించి మహారాజును సమీపించి నమస్కరించారు.

ఆయన పరమ సంతోషంతో వారిని ఆశీర్వదించి నగరంలో ఉత్సవాలు జరిపించాడు.

తన సేవకుడుగా ఉన్న బాహుకుడు నలుడని తెలియగానే ఋతుపర్ణుడు వచ్చి క్షమార్పణ కోరాడు. అనంతరం వారివద్ద సెలవు తీసుకుని వెళ్ళాడు.

నలదమయంతులు కొంతకాలం ఇక్కడే సుఖభోగాలు అనుభవించారు

అప్పుడొకనాడు నలుడు:

'నే నిప్పుడు పుష్కరుని ఓడించగల ద్యూత రహస్యాలు నేర్చుకున్నాను. వెళ్ళి వాడితో ఆడి, ఓడించి మన రాజ్యం సంపాదించి వస్తాను' అని వెళ్ళి పుష్కరుని జూదానికి పిలిచాడు. పుష్కరుడు పరమ సంతోషంతో జూదానికి దిగి సర్వమూ ఓడిపోయి నలుని పాదాలమీద పడ్డాడు.

నలుడు వానిని క్షమించి:

'నీ రాజ్యానికి మువ్వురో' అన్నాడు.

అనంతరం దమయంతినీ, బిడ్డలనూ రప్పించి ధర్మమార్గాన సత్య పాలనం సాగించి సర్వ ప్రజారంజకుడనే పేరు సంపాదించాడు.

అని మార్కండేయుడు కథ ముగిస్తూ !

ధర్మనందనా ! విన్నావుకదా !

ఆయన ఎన్ని క్లేశాలు పడినా ధర్మమార్గం విడవక సత్యం తప్పక నడిచి నందువల్ల సుఖంగా జీవించి, కీర్తి సంపాదించాడు అన్నాడు.

---

## గురుసేవ సత్ఫలితం ఇస్తుంది.

(ఇది ఆదిపర్వంలోకథ. గురుసేవ ఎంత అవసరమో, దాని ఫలితం ఎంతటిదో గ్రహించాలి.)

ఆ రోజుల్లో ఒకానొక గురుకులంలో పైలుడు అనే పేరుగల ఉపాధ్యాయుడుండేవాడు. ఆయన దగ్గర ఎందరో విద్యాభ్యాసంచేసేవారు.

ఆ రోజులలో గురుకులాలంటే చదువుకోవడానికి వచ్చే విద్యార్థులు ఆ ఆశ్రమంలోనే ఉండాలి. వారికి అన్న వస్త్రాలిచ్చి చదువు చెప్పించే భారం రాజు మీద ఉండేది. నిరంతరం గురు సన్నిధానంలో ఆయన సేవచేస్తూ వినయ విధేయతలతో విద్యనేర్చుకునేవారు. గురువుగారు కూడా వారిని తన బిడ్డలుగా చూసుకుని ఎవరికి ఏ విద్యయందు అభిరుచి ఉన్నదో గ్రహించి ఆ విద్యనే నేర్పేవాడు. తనకు కావలసిన విద్యనేర్ప గల గురువును అన్వేషిస్తూ విద్యార్థి తిరిగేవాడు. అవీ ఆనాటి గురుకులాలు.

అటువంటి గురుకులంలో పైలునివద్ద ఉదంకుడనే శిష్యుడుండేవాడు. ఈ ఉదంకుడు విద్యపూర్తిచేసుకుని సంప్రదాయం ప్రకారం గురువుగారి దగ్గర సెలవుతీసుకునే ముందు, చేతులు కట్టుకు నిలబడి, తలవంచి:

'ఆచార్యా! గురుదక్షిణ ఏమివ్వాలో ఆజ్ఞాపించండి', అన్నాడు

అప్పుడు పైలుడు చిరునవ్వునవ్వి, ఆశీర్వదించి:

'నాయనా! నీ వంటి శిష్యుడు దొరకడం మా అదృష్టం. గురు దక్షిణ ఏమీ అవసరం లేదు,' అన్నాడు.

ఉదంకుడు అలాగే నిలబడి!

'ఆచార్యా! గురుదక్షిణ ఇవ్వకుండా వెళ్ళడం న్యాయంకాదు. కనుక మీరు ఆజ్ఞాపించండి', అన్నాడు.

వాని పట్టుదల, ధర్మనిరతిచూసి సంతోషంతో!

'నాయనా! ఇంతకాలంగా నువ్వు చేసిన సేవను మించిన గురుదక్షిణ లేదు. అయినా నువ్వు తప్పదంటున్నావు కనుక ఆశ్రమంలోకి వెళ్ళి అమ్మగారు ఏం కోరుకుంటారో అడుగు', అన్నాడు పైలుడు.

ఉదంకుడు లోపలకు వెళ్ళి గురువుగారిభార్యకు నమస్కరించి విషయం చెప్పాడు.

అప్పుడావిడ :

'నాయనా! మీ గురువుగారి దగ్గర పౌష్యుడనే రాజు విద్యనేర్చుకున్నాడు. ఆ రాజుభార్య ధరించే కుండలాలు నాకు తెచ్చిపెట్టు', అంది.

ఉదంకుడు పరమానందంతో బయలుదేర బోతుండగా ఆవిడ పిలిచి:

'నాయనా! ఇంక నాలుగు రోజులలో నేను ఒక వ్రతం చెయ్యబోతున్నాను. అప్పటికి అవి తీసుకురావాలి', అంది.

'చిత్తం, తల్లీ' అని ఉదంకుడు బయలుదేరాడు.

కొంత దూరం వెళ్ళేసరికి ఎదురుగా ఒక మహావృషభంమీద ఒకానొక పురుషుడు అడ్డుగా వచ్చి:

'ఈ గోమయం భక్షించివెళ్ళు. అనుమానించకు. దీన్ని మీ గురువుగారు కూడా భక్షించారు', అనగానే ఉదంకుడు మాట్లాడకుండా అది తిని, త్వరగా రాజుగారింటికి వెళ్ళాడు.

మహారాజు చిరునవ్వుతో ఆహ్వానించి, అతని సమాచారం అడిగి: 'మీ రాకవల్ల మా జన్మ ధన్యమయింది. ఊరకరారు మహాత్ములు! ఏ పనిమీద వచ్చారో చెప్పండి', అనగా గురుపత్ని కోరిక వివరించాడు.

మహారాజు వినయంగా:

'ఓ విద్వాంసుడా! మీరు ఏదికోరినా ఇవ్వవలసిందే. ఇప్పుడు మీరు స్వయంగా అంతఃపురానికి వెళ్ళి మహారాణిని అడగండి. ఆవిడ సంతోషంగా ఇస్తుంది', అన్నాడు.

ఉదంకుడు క్షణాలలో అంతిపురికిపోయి తిరిగివచ్చి:

'రాజా! మీరు విద్వాంసులతో పరిహాసాలాడుతా రనుకో లేదు. మహారాణి అంతఃపురంలో లేదు', అన్నాడు.

రాజు: ఓ మహాత్మా! క్షమించాలి. అపవిత్రులకు నా భార్య కనబడదు. మీ వంటివారు అశుచిగా ఉన్నారనీ అనలేను.

ఉదంకుడు: గుర్తుకు వచ్చింది మహారాజా! నేను వచ్చేదారిలో ఆ పొరపాటు జరిగింది. ప్రయాణపు తొందరలో నేను కాళ్ళూ, చేతులూ, ముఖం కడగకుండా ఆచమించాను. ఇలాచెప్పి అప్పటి కప్పుడు అన్నీ ముగించి అంతఃపురానికి వెళ్ళి ఎదురుగా వినయంతో నిలిచిన రాణికి తన రాకకు కారణం చెప్పాడు.

రాణి: విద్వాంసుల కోరిక తీర్చడం మా విధి. ఇదిగో రత్న కుండలాలు తీసుకోండి. ఒకమాట. ఈ కుండలాలు దొంగిలించాలని చిర కాలంగా తక్షకుడు వేచి ఉన్నాడు. అది కనిపెట్టుకుంటూ వెళ్ళండి.

ఉదంకుడు అవి తీసుకుని చక చక వస్తున్నాడు. కొంత దూరం వచ్చేసరికి దారివెంట ముసలి బిచ్చగాడు వానిని వెన్నంటి వస్తున్నాడు.

ఉదంకుడు సాయంకాలానికి ఒక చెరువు దగ్గరకుచేరి, కుండలాలు ఒడ్డున పెట్టి సంధ్యావందనం ఆరంభించగా ఆ దొంగ వాటిని అపహరించి పారిపోయాడు.

ఉదంకుడు తిరిగి చూసేసరికి ఆ దొంగవాడు పాములామారి ఒక బిలంలో దూరాడు. దాన్ని తవ్వడానికి ఉదంకుడు శ్రమపడుతూంటే దేవేంద్రుడు వజ్రాయుధంతో ఆ బిలాన్ని విశాలం చేశాడు.

దానిగుండా పోయి పోయి ఉదంకుడు నాగలోకానికిపోయి అనేక విధాల ప్రార్థనలు చేసినా తక్షకుడు కనిపించలేదు.

కనిపించకపోగా ఎదురుగా ఇద్దరు స్త్రీలు కూర్చుని తెలుపు నలుపు దారాలతో వస్త్రం నేస్తున్నారు.

నేత చక్రాన్ని ఆరుగురు తిప్పుతున్నారు. దానికి పన్నెండు ఆకులు ఉన్నాయి. ఎదురుగా అశ్వంమీద ఒక పురుషుడు కనిపించాడు. అందరినీ స్తుతించగా ఆ పురుషుడు ప్రసన్నవదనంతో - 'వరం కోరుకో' అన్నాడు.

ఉదంకుడు: నాగలోకమంతా నా వశంలో ఉండాలి.

'అయితే ఈ గుర్రం చెవిలో గట్టిగా ఊదు' అన్నాడా పురుషుడు.

ఉదంకుడు ఊదగా నాగలోకంనిండా అగ్నిజ్వాలలు వ్యాపించాయి. ఆ మంటలకు తాళలేక తక్షకుడువచ్చి కుండలాలు సమర్పించి పాదాలమీద పడ్డాడు.

అప్పటికే కాలాతీతం కావస్తున్నది. 'గురుపత్నీ వ్రత సమయానికి ఎలాచేరడం?' అని విచారిస్తుండగా ఆ పురుషుడు తన గుర్రంయిచ్చి అదృశ్యం అయ్యాడు.

మరుక్షణంలో ఉదంకుడు గురువుగారి ఆశ్రమం దగ్గర దిగాడు. గుర్రం మాయమయ్యింది.

అప్పటికి గురువుగారిభార్య అభ్యంగస్నానంచేసి వ్రతానికి సన్నద్ధురాలవు తున్నది.

ఉదంకుడు ఆవిడ పాదాలకు నమస్కరించి, కుండలాలు అర్పించి, ఆశీర్వాదం పొంది, గురువుగారి దగ్గరకు వచ్చాడు.

ఇంత ఆలస్యం ఎందుకయింది? అని గురువుగారు అడుగగా జరిగిన విషయాలన్నీ వివరించి వాటి అంతరార్థం బోధించమని కోరాడు.

'నాయనా! నీకు ఎదురుపడిన పురుషుడు దేవేంద్రుడు. ఆ వృషభం ఆయన ఐరావతం. ఆ గోమయం అమృతం. అది భక్షించక పోతే నువ్వు నాగలోకంలో జీవించవు.

నాగలోకంలో స్త్రీలను చూశావే, వారు ధాత-విధాతలు.

నలుపు తెలుపు దారాలు రాత్రింబవళ్ళు. చక్రాన్నితిప్పే ఆరుగురూ ఋతువులు. పన్నెండాకులూ మాసాలు. ఆ చక్రం సంవత్సర రూప మయిన కాలచక్రం.

అక్కడ కనిపించిన పురుషుడు దేవేంద్రుడు. ఆ గుర్రం అగ్ని హోత్రుడు.

ఇదంతా ఎందుకు జరిగిందంటే ఇంద్రుడు నాకు ప్రాణమిత్రుడు. నువ్వు నా శిష్యుడవు కనక నీకు అపాయం జరగకుండా కాపాడాడు. నీ వలె వినయ విధేయతలతో, గురుశుశ్రూషచేసి విద్యనేర్చుకునే వారిని ఎప్పుడూ దేవతలు కాపాడుతారు. ఇకనువ్వు మీ ఇంటికి వెళ్ళు. నీకు సర్వశుభాలూ కలుగుగాక', అని గురువుగారు ఆశీర్వదించాడు.

## కులంకాదు గుణం ప్రధానం

(ఇది అరణ్యపర్వంలో మార్కండేయ మహాముని చెప్పిన కథ. దీన్నిబట్టి కుల వర్గ విద్వేషాలు ఈనాటి నాగరక సమాజంలో బలిసినంతగా ప్రాచీన కాలంలో ఉండేవి కావనీ, మంచి విషయం ఎవరి దగ్గర ఉన్నా గ్రహించవలసినదేనని తెలుసు కోవాలి.)

కులం కారణంగా ఉన్నత స్థానాలు, మర్యాదలు యివ్వడం ఈ నాడు పెరిగినంతగా భారతకాలం నాడు లేనేలేదు. గుణం ప్రధానంగా మనిషిని మర్యాద చేయడం అందరూ ఎఱిగిందే. అటువంటి అంశం యిది.

ఒకానొక గ్రామానికి సమీపంలో ఒక వనం. ఆ వనంలో ప్రశాంత ప్రదేశం. అక్కడొక చిన్నినది. ఆ నది ఒడ్డునే చక్కని నీడనిచ్చే పెద్ద చెట్టు. ఆ చెట్టు క్రింద కూర్చుని ఒక విప్రుడు తపస్సు చేసుకుంటూ, మధ్యాహ్నం కాగానే గ్రామంలోకి వెళ్ళి భిక్షాటనం చేసి జీవితం గడుపుతున్నాడు.

అలా తపస్సు చేసుకునే రోజులలో ...

ఒకనాడు —

ఆయన భిక్షాటనకు లేచే సమయంలో చెట్టుమీది కొంగ రెట్టవేసింది. అది ఆయన మీద పడింది.

అంతతో ఆయనకు చాలా కోపం వచ్చింది. అంతే: కన్నులు ఎఱ్ఱజేసి పైకి చూశాడు.

చూసిన మరుక్షణంలో ఆ కొంగ మాడి పడిపోయింది.

ఆయన యథాప్రకారం గ్రామంలో భిక్షకువెళ్ళి, ఒక యింటి గుమ్మంలో నిలబడి: 'భవతి! భిక్షాం దేహి', అన్నాడు.

ఆ మాట చెవిని పడగానే యింట్లోని గృహలక్ష్మి ఆయనకు భిక్ష తేవడానికి వంటయింటి వయిపు నడిచింది.

అదే సమయానికి ఆమె భర్త దూర ప్రయాణం చేసి యింటికి వచ్చాడు.

భర్తను చూడగానే ఆమె చల్లని నీటితో ఆయన పాదాలు కడిగి, విసన కర్రతో కొంతసేపు విసిరి, భోజనం చేయించి, వరుండాక, భిక్ష తీసుకుని వీధిలోకి వచ్చింది.

అక్కడ నిలబడ్డ ముని కోపంగా చూశాడు. అప్పుడామె:

'స్వామి! మీ కోపానికి మాడిపోయే కొంగనుకాను. భర్తను సేవించిన అనంతరమే మరెవరి విషయమయినా చూసుకుంటాను. పతి సేవను మించిన పరమార్థం వేరే లేదు, నాకు'

అని నిలబడింది.

అప్పుడా ముని తెల్లబోయి:

'అమ్మా! ఎక్కడో, అడవిలో జరిగిన నా కథ నీకు ఎలా తెలిసింది? నాకు జ్ఞానబోధ చెయ్యి తల్లీ', అని ప్రార్థించాడు.

గృహిణి: 'మునీశ్వరా! ఇక్కడకు కొద్ది దూరంలో మిథిలానగరం ఉంది. అక్కడ ఒక బోయవాడు మాంస విక్రయం చేసి జీవితం గడుపుతున్నాడు. వానిపేరు ధర్మవ్యాధుడు. ఆయన మీకు సర్వవిషయాలూ బోధిస్తాడు, వెళ్ళండి', అంది. ఆయన బయలుదేరి నడిచి నడిచి మిథిలా నగరం చేరాడు.

నగరంలో అడుగు పెడుతూనే ధర్మవ్యాధుని నివాసం గురించి అడిగి, తెలుసుకుని ఆ ప్రాంతానికి చేరాడు.

అక్కడ రకరకాల జంతువుల మాంసాలు చూసి దూరంగా నిలబడ్డాడు.

వచ్చిన మునిని అంత దూరంలో చూసి ధర్మవ్యాధుడు ఎదురుగా వెళ్ళి నమస్కారం చేసి:

'ఆర్యా!' ప్రణామాలు. మిమ్ము నా దగ్గరకు పంపిన పతివ్రతా శిరోమణి క్షేమంగా ఉన్నదా! అని అడిగాడు.

వచ్చిన మునికి మతిపోతోంది.

'అక్కడ ఆ యిల్లాలు కొంగ విషయం చెప్పింది. ఈ ధర్మ వ్యాధుడు ఆ ప్రతివ్రత క్షేమం అడిగాడు. ఇంతకాలంగా తపస్సు చేసినా ఏ శక్తి సాధించ లేకపోయాము.

ఆవిడ పతివ్రత కనుక ఆ వ్రత దీక్షతో దూరదృష్టి వచ్చి ఉండ వచ్చు.

జంతువుల మాంసం అమ్ముకునే ఈ కసాయి వానికి ఇంత శక్తి ఎలా వచ్చింది' అని ఆలోచనలో పడ్డాడు.

అది గ్రహించి ధర్మవ్యాధుడు :

'స్వామీ! ఈ మాంసపు వాసన మీరు భరించలేరు. రండి మా యింటికి వెళదాం. నాకు యింతటి శక్తి ఎలా వచ్చిందని ఆలోచిస్తు న్నారు కదూ! ప్రత్యక్షంగా మీకు చూపిస్తాను'

అని వినయంగా యింటికి తీసుకువెళ్ళాడు. వెడుతూనే వాకిట్లో మంచంమీద పడుకున్న, ముసలి తండ్రి పాదాలకు నమస్కరించి, ఆయన యోగ క్షేమాలు విచారించి, లోపల గదిలో ఉన్న తల్లికి నమ స్కరించి, ఆవిడకు సేవచేసి:

'స్వామీ! ఇదే నేను చేసేది. మనం ఎన్ని వ్రతాలు చేసినా, పూజలు జరిపినా, తల్లి దండ్రులను సేవించుకోకపోతే ప్రయోజనం లేదు.

తొమ్మిది మాసాలు గర్భంలో మనలను భరించి, ప్రసవవేదనపడి, మనకు జన్మనిచ్చి, నాలుగైదు సంవత్సరాల వయసు వచ్చే వరకూ మన ఆరోగ్యం కోసం ఆ తల్లి ఎన్నో అవస్థలు పడుతుంది.

అటువంటి తల్లి ఋణం ఎన్ని సేవలు చేసినా తీరుతుందా!

అలానే మన భవిష్యత్తుకు పునాదులు వేసి, మనకోసం ఎన్నో బాధలు పడే తండ్రి ఋణం కూడా తీరదు.

అయినా వారిని సేవించుకోవడం వల్ల కొంత ఋణ భారం తగ్గుతుంది.

వీరిని సేవించుకోవడం కంటె నేను చేసే సాధన ఏమీలేదు. దాని వల్లనే నేను సుఖంగా ప్రశాంతంగా బ్రతుకుతున్నాను. తల్లి దండ్రులను సేవించుకుంటూ ఆలుబిడ్డలను రక్షించుకుంటూ జీవితం నడుపుతున్నాను. అంతే! మరేంలేదు. మీకు మరో సందేహం కలిగి ఉంటుంది. మాంసం అమ్ముకుని బ్రతుకుతున్నాను కదా! అది జీవహింసకాదా, దానివల్ల పాపంకదా అని. ఇక్కడ తమకొక పరమ రహస్యం చెప్పాలి.

అదీ ధర్మ సూక్ష్మం అంటే-

ఈ భూగోళంలో ప్రాణికోటి అంతా ఒక దానిమీద ఆధారపడి మరొకటి జీవిస్తున్నది. రెక్కలు విప్పుకు ఎగిరే పక్షులూ, నాలుగు కాళ్ళ జంతువులూ యివే ప్రాణులని మీరు అనుకుంటున్నారు. మీరు తినే ధాన్యం, కాయగూరలు, పళ్ళు అన్నింటిలోనూ జీవం ఉన్నది. అయితే అవి పక్షులవలె ఎగరడం లేదు కనక జీవం లేదనుకోవడం న్యాయమా!

జీవి బ్రతికి, పెరగడానికి మరోజీవం బలికాక తప్పదు.

అలాకాదు, యిదీ జీవహింస అంటారా!

నేను మానినంతలో నా దుకాణానికి వచ్చేవారందరూ మాంసాహారం వదులుతారా! అందుచేత మీరు ఈ అనుమానం వదిలేయండి. ప్రాణాలు నిలుపుకోవడానికి అవశ్యకమయిన ఆహారంకోసం జరిపేది హింసకాదు.

మరొకమాట: ఈ జంతువులను ఎవరో సంహరించి తెస్తారు. నా వృత్తి ధర్మానుసారం దీనిని విక్రయం చేసి బ్రతుకుతాను.

వ్యాపారంలో దొంగ తూకాలూ, అధిక లాభాలూ నేనెరుగను.

నా ధర్మాన్ని నేను విడిచి పర ధర్మాన్ని స్వీకరించను. ఆకలి గొన్న వారికి పిడికెడు అన్నం పెడతాను. నా మీద ఆధారపడి జీవించే వారందరి యోగ క్షేమాలు తెలుసుకుంటాను. ఇరుగు, పొరుగులవారి కష్ట సుఖాలలో భాగం పంచుకుంటాను.

అన్నిటినీ మించిన విషయం -

ఈ మనస్సు ఉన్నదే యిది స్థిరంగా నిలబడదు. ముందు దీన్ని లొంగదియ్యాలి. రాగద్వేషాలకు అతీతంగా ఉండాలి. నిర్మల బుద్ధితో నిరంతరం పరమేశ్వరారాధనం చెయ్యాలి.

నేను చేసేది యింతే। ఈ మాత్రం చెయ్యగలిగితే మనకు ఏ బాధలూ ఉండవు. ఈ జీవితం ఎంతవరకూ పరోపకారానికి ఉపయోగపడితే అంత ధన్యం।' అని బోధించాడు.

గొడ్డు మాంసం అమ్ముకుని జీవించే బోయవాడు చేసిన ప్రబోధంతో మనస్సు నిర్మలమై ప్రశాంతంగా వాని వద్ద సెలవు తీసుకుని తపస్సు చేసుకునేందుకు వెళ్ళాడాయన.



## సుందోపసుందులు

( ఇద్దరు తమలో తాము పోట్లాడుకొని ఇద్దరూ నాశనమవడాన్ని సుందోప సుందన్యాయ మంటారు. )

ఈ నాటికీ మారుమూల పల్లెలలోనే కాక, మహానగరాలలో కూడా భారత సంస్కారం కలవారు ఈ సామెత వాడుతుంటారు. సుందోప సుందుల వలె కొట్టుకుంటున్నారు అని. ఆ కథ భారతం ఆదిపర్వంలో నారదుడు వినిపిస్తున్నాడు.

ధర్మరాజా !

హిరణ్యాక్ష, హిరణ్యకశిపుల కథ ఎరుగుదువు కదా ! వారి వంశములో కుంభుడనే పేరు గల రాక్షసుడుండేవాడు. వీడు మహాబలశాలి. ఈ బలశాలికి ఇద్దరు కుమారులు.

వారు మహా భయంకర దేహులు. పెద్దవాడు సుందుడు. వాడి తమ్ముడు ఉపసుందుడు. ఇద్దరూ ఎంతో అన్యోన్యంగా ఉండేవారు. ఏ విషయంలోనూ వారికి అభిప్రాయ భేదం లేదు.

నిరంతరం ఒకరినొకరు విడువకుండా కలిసి తిరిగే వారు.

అలా ఉండగా వారికి తమ పూర్వీకుల వలె త్రిలోకాలనూ జయించాలనే కోరిక కలిగింది. కలగగానే వింధ్యపర్వతం చేరి ఆ గిరి శిఖరం మీద పద్మాసనం వేసి తపస్సు ఆరంభించారు. అన్నపానాలు విడిచేశారు.

వాయువునే ఆహారంగా గ్రహిస్తూ, ఒంటికాలి బొటనవ్రేలుమీద నిలబడి తీవ్రదీక్షతో సాధన చేస్తున్నారు. ఆ తపస్సు వేడికి మంటలు లేచేవి. ఎలా అయినా ఆ సోదరుల తపస్సుకు భంగం కలిగించాలని దేవతలు ఎన్నో ప్రయత్నాలు చేశారు. వారు చలించలేదు. ధ్యానసమాధిలోనే ఉన్నారు.

బ్రహ్మ ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు.

ప్రపంచంలో అస్త్ర శస్త్ర విద్య అంతా తమకు రావాలనీ, ఇంద్రజాల మహేంద్రజాల విద్యలు తమ అధీనంలో ఉండాలనీ, తమకుతమకు

వైరం వచ్చి ఒకరినొకరు చంపుకుంటే తప్ప మరెవరివల్లా చావు రాకూడదనీ కోరుకున్నారు.

అనుగ్రహించి బ్రహ్మ అదృశ్యమయ్యాడు.

వారు తమ నగరం చేరి సేనలతో విజయ యాత్రకు బయలుదేరారు.

ముందుగా అమరావతిని స్వాధీనం చేసుకున్నారు. అనంతరం భూలోకం, నాగలోకం, యక్షరాక్షస లోకాలన్నీ వశపరుచుకున్నారు.

పెద్దపులి రూపాలతో, సింహాకారాలతో గుహలలో దూరి అక్కడ తపస్సు చేసుకునే మునులను హింసించే వారు.

ఆశ్రమాలలో ప్రవేశించి యజ్ఞసామగ్రిని విరిచి, విసిరేసే వారు.

అలా ప్రపంచం అంతటా తిరుగుతూ సాధు, సజ్జన హింసతో, పర స్త్రీ బలాత్కారాలతో జీవితం నడుపుతున్నారు.

ప్రపంచంలో ఏ ప్రాణికీ శాంతి లేదు. అంతటా దీనారావాలు, హాహాకారాలు. ఏ పూట ఎవరికి కీడు మూడుతుందో తెలీదు. ఏ రాత్రి ఏ నగరం శ్మశానం అవుతుందో తెలీదు.

అలా భయానకంగా ఉన్న సమయంలో దేవతలూ, మునులూ కలిసి బ్రహ్మను ప్రార్థించగా ఆయన విశ్వకర్మను పిలిచి!

మహాశిల్పీ! ప్రపంచంలో ఎంతటి వారి నయినా వరే కనుచూపుతో ఆకర్షించి పాదాక్రాంతం చేసుకోగల సుందరీమణిని సృష్టించు అన్నాడు.

ఆలోచించాడు విశ్వకర్మ.

ఇంతకుముందు నిర్మించిన సుందరరూపాలన్నింటినించి అందాన్ని నువ్వుగింజంత (తిలాంశ) తీసి ఒక అందగత్తెను రూపొందించాడు.

కాలిగోరు నుంచి కనురెప్పల వరకూ అంతా లావణ్యం జాలువారుతున్నది.

తిలాంశగా తీయడం వల్ల ఆమెకు తిలోత్తమ అని పేరు పెట్టారు.

ఆమె బయలుదేరింది.

దేవతా నాయకు లందరికీ కన్ను చెదరింది. దేవేంద్రుడు వెయ్యి కళ్ళూ విప్పి చూశాడు. అంతటి అందగత్తె అంచనడకలతో, కాలి అందెల రవళి ఎందరినో మోహింపచేస్తూ సాగిసాగి సుందోపసుందులున్న వనానికి వచ్చి విలాసంగా విహరిస్తున్నది.

అది వింధ్యగిరి శిఖరం.

అక్కడ విశాలమయిన సాలవృక్షం.

ఆ చెట్టు నీడలో రకరకాల పానపాత్రలు.

కనులు మిరుమిట్లుగొలిపే కామినీ జనం.

హంసతూలికాతల్పాలు.

వింజామరలతో సుందరీమణులు.

కమ్మని కంఠాలతో పాటలు.

ఆ పాటలకు అనుగుణంగా అందెలరవళులతో, గాజుల గలగలలతో, చూపుల మిలమిలలతో సుందరాంగుల నాట్యాలతో ఆ సోదరు లిద్దరూ పరమ సంతోషంగా ఉన్నారు.

అటువంటివారి కంటికి అల్లంత దూరంలో వయ్యారంగా పయిట జారుస్తూ కనులు త్రిప్పుతూ, తన అందాన్ని ఒలకబోస్తూ నిలిచింది తిలోత్తమ.

అంత మైకంలో ఉన్న అన్నదమ్ము లిద్దరూ ఆ సుందరిని చూస్తూనే కోరమీసం ఎగదువ్వుతూ, పానపాత్రలు జారవిడిచి, ఆశ నిండిన కనులతో, రాచఠీవితో, ఆమె వయిపే అడుగులు వేశారు.

ఇద్దరూ దగ్గరగా చేరారు.

ఆమె భయాన్నీ, సిగ్గునీ, అభినయిస్తూ, జారుతున్న పైట సరి చేస్తున్నట్టు నటించి, వెనుదిరిగి ఓరచూపుతో యిద్దరినీ రెచ్చగొట్టింది.

ఒకడు కుడిచెయ్యి అందుకుంటూండగా రెండవవాడు ఎడమచెయ్యి పట్టుకున్నాడు.

బలమదం, ధనమదం, రాజ్యమదం, వరమదం ఇన్నిటికీ మద్యపానమదంలోవున్న వారిని చూసి తిలోత్తమ ఒక కంటితో సుందుని రెండవ కంటితో ఉపసుందుని రెచ్చగొట్టింది.

"తమ్ముడూ! అన్నగారి భార్య తల్లితో సమానం. నువ్వు దీన్ని తాకకూడదు" అన్నాడు సుందుడు.

"తమ్ముని భార్య కోడలితో సమానం. నువ్వు దూరంగా వెళ్ళు" అన్నాడు ఉపసుందుడు.

మీరిద్దరూ తేల్చుకోండి, అని దూరంగా నిలబడి యిద్దరి వయిపూ కోరచూపులే విసిరింది తిలోత్తమ.

కామమదంతో రెచ్చిపోయిన ఉభయులూ ఒళ్ళు తెలియకుండా ఒకరినొకరు పిడిగుద్దులతో, మోకాటిపోటులతో కొంతసేపు యుద్ధం సాగించారు.

అంతలో గదాదండాలు అందుకున్నారు.

ఆ గదా ఘాతాలతో వారి శరీరాలు చీలి రక్తధారలు సెలఏరుల్లా ప్రవహించాయి.

అంతే పర్వత దేహులయిన అన్నదమ్ము లిద్దరూ నదీ ప్రవాహంలో బండరాళ్ళవలె నేలకూలారు, అని నారదుకు కథ ముగించి,

నాయనా! కామపిశాచి ఎంత చెడ్డదో చూశావా, అన్నాడు.

---

## విద్య వివేక హేతువు :

( ఈ కథ అరణ్య పర్వంలో ఉంది )

విదేహ దేశాన్ని పాలించే జనక మహారాజు ఆస్థానంలో వంది అనే మహా విద్వాంసుడు ఉండేవాడు.

ఎంతటి మహా విద్వాంసుడైనా వందితో వాదించి గెలవలేక పోతున్నాడు. అందరినీ ఓడించిన అహంకారంతో ఉన్న వంది :

'నాతో వాదించి ఓడినవారిని నదీ 'ప్రవాహంలో ముంచేస్తాను', అని ప్రకటించాడు.

అలా ఎందరినో నదిలో తోయించి సగర్వంగా ఉన్నాడు వంది.

ఆ రోజులలో —

ఉద్దాలకుని శిష్యుడైన కహోడుడు విదేహ చేరి వంది చేతులలో ఓడిపోయి ప్రాణాలు విడిచాడు.

అప్పటికి గర్భవతిగా ఉంది కహోడుని భార్య సుజాత. భర్త మరణవార్త విని ఎంతో దుఃఖించింది. గర్భంలో ఉన్న శిశువు మీద మమకారాన్ని చంపుకో లేక విచారాన్ని విడనాడి జీవితం గడుపుతూ కొంత కాలానికి కుమారుని కన్నది.

ఆ బాలుడు తండ్రి శాపంవల్ల ఎనిమిది వంకరలతో పుట్టాడు. అందువల్ల అంతరూ వానిని 'అష్టావక్రుడు' అని పిలిచేవారు.

పన్నెండు సంవత్సరాలు గడిచాయి. అప్పటికి అష్టావక్రునికి తన తండ్రి మరణ కారణం తెలిసి, వందితో వాదనకు బయలుదేరి విదేహ రాజ్యానికి వచ్చాడు.

'నిండా పన్నెండేళ్ళు రాని బాలుడు వందివంటి మహా విద్వాంసునితో వాదించడమా!' అని ద్వారపాలకుడు నిరోధించాడు.

'ద్వారపాలకా! విద్యకు వయస్సుతో నిమిత్తం లేదు. జుట్టు నెరసి వయస్సు ముదిరినవాడు మహా విద్వాంసుడని అనుకోకు', అని వాదిస్తుండగా అటు వచ్చిన జనక మహారాజు :

'ఆర్యా! మా ఆస్థాన విద్వాంసుడు వంది ప్రచండ సూర్య సముడు. ఆయన ముందు మిగిలిన విద్వాంసులందరూ చిన్న చిన్న నక్షత్రాలవలె వెల వెల బోతుంటారు' అనగా అష్టావక్రుడు:

'మహారాజా! నా వంటి వాడెవరూ మీ సభా భవనానికి వచ్చి ఉండరు, అన్నాడు.

'అయితే ముప్పది అవయవాలతో, పన్నెండు అంశలతో ఇరువది నాలుగు పర్వాలతో మూడు వందల అరువది రేకులతో ఉండే దానిని ఎరిగిన జ్ఞానివా నువ్వు?' అని జనకుడు ప్రశ్నించాడు.

'మహారాజా! ముప్పది దినాలు అవయవాలు, అమావాస్యలు పన్నెండు, పూర్ణిమలు పన్నెండు, ఈ ఇరువది నాలుగు పర్వాలు, పన్నెండు నెలలు అంశలు, మూడు వందల అరువది రోజులు రేకులు, అటువంటి సంవత్సర రూపమయిన కాలచక్రం మీకు సమస్త కళ్యాణాలు కలిగించుగాక', అన్నాడు.

జనకుడు: ఆడు గుర్రాలజంటవలె కనిపిస్తూ, హఠాత్తుగా డేగలా మీద పడే ఆ రెండిటినీ ధరించే దెవరు?

అష్టా: మహారాజా! అవి మీ శత్రువుల గృహాల మీద పడకూడదని కోరుతున్నాము. ప్రాణ నామాలతో ఉండే ఆ రెండు తత్వాలవల్ల విద్యుత్తు పుడుతుంది. వీటిని మేఘం ధరిస్తుంది.

జన: కన్ను మూయకుండా నిద్రించేది ఏది?

అష్టా: నిరంతరం నీటిలో ఉండే చేప.

జన: జన్మించినా చైతన్యం లేనిది ఏది?

అష్టా: పక్షులు పెట్టే గ్రుడ్డు.

జన: హృదయం లేనిదేది?

అష్టా: బండరాయి.

జన: ఓ వేదవేత్తా! ఇప్పుడు మీరు మా మండపానికి వచ్చి వాదన సాగించవచ్చు అని సాదరంగా తీసుకు వెళ్ళాడు.

భూశాడు మహావిద్వాంసుడు వంది. అష్టావక్రుడు అయనను సమీపించాడు.

వంది: బాలకా! నిద్రపోయే సింహాన్ని లేవకు. కాలకూట విషభరిత మయిన పాము పడగ మీద కాలు పెట్టకు.

అష్టా: మహారాజా! పర్వతాలన్నీ మైనం కంటె చిన్నవి. లేగదూడలు అంబోతుకంటె చిన్నవి. రాజులందరూ జనకునికంటె అల్పులు. దేవతలలో యింద్రుని వలె, నరులలో ఉత్తముడుగా ఉన్న మహారాజువు నువ్వు. మీ విద్వాంసుడైన వందిని వాదానికి రమ్మనండి. ప్రారంభిస్తున్నాను నా వాదం.

అగ్ని ఒకటి అయినా అనేక రూపాలలో ప్రకాశం ఇస్తుంది. సూర్యుడొక్కడే సర్వలోకాలకు వెలుగు. దేవేంద్రుడొక్కడే ఏకైక వీరుడు. పితృ దేవతాపతి, యముడొక్కడే, అని ప్రారంభించాడు, వంది.

అష్టా: వంది! ఇంద్రుడు - అగ్ని నిరంతర స్నేహబంధంతో ఉండే దేవతలు. అలానే పర్వత నారదులు. అశ్వనీ దేవత లిద్దరు. రథానికి చక్రాలు రెండు. పతిపతులు ఇద్దరు.

వంది: ప్రాణికోటి అంతా దేవమానవ తిర్యగ్రూపాలు మూడు ధరిస్తుంది. ఋగ్యజుస్సామాలు మూడే వేదాలు. ప్రాతర్మాధ్యాహ్నిక సాయం సవనాలు మూడు. స్వర్గ మర్త్య నరకాలు మూడే లోకాలు. అగ్ని, సూర్య చంద్రులు ముగ్గురే జ్యోతి స్స్వరూపులు.

అష్టా: బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసాశ్రమాలు నాలుగు. బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర జాతులు నాలుగు. దిక్కులూ నాలుగే. హ్రస్వ, దీర్ఘ, ప్లుత, హల్లు భేదాలతో శబ్దం నాలుగు రకాలు. పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరి అని వాక్కు నాలుగు రగాలు.

వంది: గార్హపత్య, దక్షిణాగ్ని, అహవనీయ, సభ్య అవశ్యం అనే అవస్థా భేదంతో యజ్ఞాగ్ని అయిదు విధాలు. పంక్తి ఛందస్సుకి

పాదాలు అయిదు. దేవ, పితృ, ఋషి, మనుష్య, భూత, యజ్ఞాలు అయిదు. కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మం అని జ్ఞానేంద్రియాలు అయిదు. విపాశ, ఇరావతి, వితస్త, చంద్రభాగ, శతుద్రు నామాలతో ప్రఖ్యాత మైనది పంచనాదం.

అష్టా : బాలకా! అగ్ని స్థాపనవేళ ఆరు ఆవులను దక్షిణ ఇవ్వాలి. ఆరుఋతువులే సంవత్సర కాల చక్రాన్ని నడుపుతాయి. మనస్సుతో కలిసి జ్ఞానేంద్రియాలు ఆరు. కృత్తికలు ఆరు. యజ్ఞాలు ఆరు.

వంది : విద్వాంసుడా! ఆవు, దున్న, మేక, గుర్రం, కుక్క, పిల్లి, గాడిద- ఇవి ఏడూ గ్రామాలలో ఉండే జంతువులు. సింహం, శార్దూలం, లేడి, తోడేలు, ఏనుగు, వానరం, భల్లూకం - యివి ఏడూ వన్యమృగాలు. గాయత్రి, బృహతి, జగతి, అతి జగతి, పంక్తి, త్రిష్టుప్, అనుష్టుప్, తేవాలతో ఛందస్సు ఏడురకాలు. అత్రి, పులస్త్య, క్రతు, మరీచి, అంగిరస, వసిష్ఠులు సప్త మహర్షులు. ధూప, దీప, నైవేద్య, ఆచమన, గంధ, పుష్ప, తాంబూలాదులు కూడా ఏడే.

అష్టా : తులాదండాన్ని బంధించే సూత్రాలు ఎనిమిది. సింహాన్ని సంహరించే శరభ మృగానికి ఎనిమిది పాదాలు. యజ్ఞశాల సమీపంలో యూపస్తంభానికి కోణాలు ఎనిమిది. వసువులు ఎనమండుగురు.

వంది : పితృయజ్ఞవేళ అగ్నిని ఉపాసించే సామిధేను మంత్రాలు తొమ్మిది. ప్రకృతి, పురుష, అహంకార, మహత్తత్త్వ, పంచతన్మాత్రలు తొమ్మిది. వీటి సంయోగం వల్లనే సృష్టి సాగుతున్నది. బృహతీ ఛందస్సుకు ప్రతిపాదంలోనూ తొమ్మిదే అక్షరాలు. గణితశాస్త్రం యావత్తూ తొమ్మిది అంకెలమీద ఆధారపడి ఉంది.

అష్టా : దిక్కులుపది. గర్భంలో జీవుడు పది మాసాలుంటాడు. రోగి, దరిద్రుడు శోకార్తుడు, రాజదండితుడు, వృత్తిలో మోసపోయినవాడు, పిచ్చివాడు, కాముకుడు, అసూయాపరుడు, మూర్ఖుడు మొండివాడు ఈ పదిమందీ నిందార్హులు. గురువు, తండ్రి,

పెద్దన్నగారు, ప్రభువు, మాతామహి, పితామహులు, మేనమామ, మామగారు, తండ్రిసోదరులు, కుటుంబంలో వృద్ధులు ఈ పది మంది పూజింప దగినవారు.

ప్రాణికి పది దశలు :

గర్భవాసం, జననం, బాల్యం, కౌమారం, పౌగండం, కైశోరం, యౌవనం, ప్రౌఢత్వం, వార్ధక్యం, మృత్యువు.

వంది : ప్రాణి కోటికి యింద్రియాలు పదకొండు. విషయాలూ పద కొండే. జ్ఞాన, కర్మేంద్రియాలతో మనస్సు కలిసి పదకొండు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు జ్ఞానేంద్రియ విషయాలు.

మాట, పని, నడక, మలాదుల విసర్జన, భార్యా సంయోగం యివి కర్మేంద్రియాలు చేసే పనులు. వీటి మననం మనస్సు చేసేపని. ఇవి పదకొండు.

కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్య, రాగ, ద్వేష, హర్ష, శోక, అహంకారాది వికారాలు పదకొండు.

మృగ, వ్యాధ, సర్ప, అజైకపాద, అహిర్బుధ్న్య, కపాలి, పినాకి, నిర్పతి, దహన, స్థాణు, ఈశ్వర – వీరు ఏకాదశ రుద్రులు.

అష్టా : పసివాడా! మాసాలు పన్నెండు. జగతీ ఛందస్సుకి అక్షరాలు పన్నెండు. ప్రాకృతయజ్ఞం పన్నెండు రోజులు సాగుతుంది. ఆదిత్యులు పన్నెండుగురు.

వంది : తిథులలో త్రయోదశి మంచిది. భూమిమీద పదమూడుద్వీపాలు ఉన్నాయి అని ఆగిపోయి ఆలోచన ఆరంభించగా,

అష్టావక్రుడు : మహారాజా! మీ విద్వాంసుడు శ్లోకం సగం చదివి విర మించాడు. మిగిలింది నేను చెబుతా.

కేశి దానవునితో మహావిష్ణువు పదమూడు రోజులు యుద్ధం చేసాడు. వేదంలోని అతిజగతి ఛందస్సు పదమూడక్షరాల పరిమితితో నడుస్తుంది. అనగా, వంది తల వంచేశాడు.

నియమానుసారం పంది తనకు తానే నదిలో మునిగిపోయాడు. మనకు ఎంత విద్య ఉన్నా, వయస్సు మీరినా, వివేకాన్ని దిగమింగే అహంకారంతో నడుచుకునే వారు పంది వలెనే పసివారి ప్రజ్ఞముందు పతనమయిపోతారు.

విద్య వినయాన్ని కలిగించాలికాని గర్వ హేతువు కారాదు.



## విద్యా దీక్ష

(ఈ కథ ఆదిపర్వంలో ఉంది. విద్యాభ్యాస సమయంలో యితర వ్యవహారాల మీద మనసు పోనివ్వకుండా దీక్షగా చదివితే మంచి ఫలితాలు సాధించగలం అనికదా ఈ కథ ద్వారా భారతం చేసిన హితబోధ)

చాలా రోజుల క్రితం మాట।

కశ్యపుడు అనేముని ఉండేవాడు. ఆయనకు దితి, అదితి అని ఇద్దరు భార్యలు. దితికి కలిగిన పిల్లలు రాక్షసులు అదితి పిల్లలు దేవతలు.

ఈ అన్నదమ్ములు నిరంతరం యుద్ధాలు చేసుకుంటూనే ఉండేవారు. ఒకప్పుడు వారు, ఒకప్పుడు వీరు గెలిచేవారు.

అలా సాగుతోంది.

అందులో రాక్షసులకు గురువు శుక్రాచార్యులు. దేవతల గురువు బృహస్పతి. ఆ రాక్షసగురువు చాలాకాలం తపస్సు చేసి మృతసంజీవనీ అనే విద్య సాధించాడు. దానివల్ల యుద్ధంలో చచ్చిన రాక్షసులందరినీ మళ్ళీ బ్రతికించేవాడు.

అప్పటికింకా దేవతలు అమృతపానం చెయ్యలేదు. కనుక వారు చచ్చిపోయేవారు. అది చూచి బృహస్పతి తనకుమారుడయిన కచుని పిలిచి శుక్రాచార్యుల దగ్గర మృత సంజీవనీ విద్య నేర్చుకురమ్మని పంపాడు.

కచుడు శుక్రాచార్యుల దగ్గరకు వచ్చి:

'శ్రీగురుభ్యోనమః' అని పాదాలమీద వ్రాలి:

'నేను ఆంగీరస వంశ్యుడను, బృహస్పతి తనయుడను. నన్ను కచుడు అని పిలుస్తారు. మీ వద్ద విద్యాభ్యాసానికి వచ్చాను' అన్నాడు.

శుక్రాచార్యులు ఆ కుర్రవాని వినయానికి చాలా సంతోషించి:

'నాయనా! చాలా ఆనందం' అని ఆశీర్వదించి తన ఆశ్రమంలో ఉండమన్నాడు.

కచుడు రోజూ సూర్యోదయంకాకుండా లేచి కాలకృత్యాలు ముగించి సంధ్యావందనాలు యథావిధిగా సాగించి గురుశుశ్రూష చేస్తున్నాడు.

శుక్రాచార్యులవారికి దేవయాని అనే కూతురుంది. ఆ అమ్మాయి చాలా అందగత్తె. అందులోనూ వయస్సు పదహారు దాటింది.

ఆ పిల్లకి కచుడు మీద మనసు పడింది. అనేకవిధాల తన ప్రేమను వ్యక్తంచేసేది. కచుడికి తన విద్యాభ్యాసం తప్ప మరోదృష్టి లేదు. పయిగా గురువుగారి కూతురు కనుక సోదరభావంతోనే చూసేవాడు.

ఇలా ఉండగా —

రాక్షసులందరూ సమావేశమై ఆలోచించారు.

'దేవతల గురువయిన బృహస్పతి కొడుకు మన గురువులవద్ద విద్యాభ్యాసానికి వచ్చాడు? శత్రువర్గం వారి దగ్గర ఏం చదువుదామని వచ్చాడు? ఓహో! మన గురువుగారి దగ్గర మృత సంజీవనీ విద్య ఉంది.

అది వీడు నేర్చుకు వెడితే మన వంశానికే ప్రమాదం. కనక వీణ్ణి అడవిలో చంపి పారేద్దాం' అని నిశ్చయించారు.

గురు సేవాభావంతో అడవిలో ఆవులనుమేపి వస్తున్న కచుడిని చంపేశారు.

ప్రొద్దు గ్రుంకింది.

చీకటి ముదురుతోంది.

రోజూ సాయం సంధ్యావేళకు ఆశ్రమంచేరే కచుడు అప్పటికీ రాకపోవడంతో దేవయాని తండ్రి దగ్గరకు వెళ్ళి ఏడ్చింది. కూతురు దుఃఖం చూడలేక శుక్రాచార్యులు దివ్య దృష్టితోచూచి, జరిగిన సంగతి గ్రహించి మృత సంజీవనితో కచుని బ్రతికించారు.

అది విన్న రాక్షసులకు కడుపు మండి పోయింది. బాగా ఆలోచించారు. కచుని సంహరించి కాల్చి ఆ బూడిద కలిపిన కల్లు తెచ్చి శుక్రాచార్యులకు వినయంగా అందించారు.

ఆయన వెనుక ముందు ఆలోచించకుండా ఆ సురాపానం చేశాడు. వాడు వెళ్ళారు.

మళ్ళీ చీకటి పడింది.

ప్రేమపాశంలో ఉన్న దేవయాని తండ్రి దగ్గరకు వచ్చి ఏడ్చింది. ఆయన కాలివడి దివ్య దృష్టితో చూశాడు. విషయం తెలిసింది.

'అమ్మా! ఈ రాక్షసులు పరమ కిరాతకం చేశారు. ఆ బాలుని చితాభస్మం కలిపిన కల్లు నా చేత త్రాగించారు. ఇప్పుడు నా గర్భంలో ఉన్నాడు కచుడు. వాడు జీవించాలంటే నా పొట్ట చీల్చుకు రావాలి. వచ్చాక నన్ను బ్రతికించాలి. అంటే లోపల సూక్ష్మ అణువుగా ఉన్న ఆ ప్రాణికి నా విద్య బోధించాలి.

వివేకహీనులైన రాక్షసులు ఈ విధంగా వాడికి మేలుచేశారు', అని పద్మాసనం వేసి, లోపల ఉన్న కచుని ప్రబోధించి మృత సంజీవనీ మంత్రం ఉపదేశించాడు.

కచుడు ఆయన ఉదరం చీల్చుకు వచ్చాడు.

వస్తూనే తాను నేర్చిన విద్యతో గురువుగారిని జీవింపజేసి ఆయన వద్ద సెలవు తీసుకు వెడుతున్నాడు.

వెను వెంట వచ్చి దేవయాని:

'ఏమయ్యా! ఇంతకాలం నిన్నే ప్రేమించే నన్ను విడిచి వెడ తావా!' అంది.

'సోదరీ! గురువు తండ్రితో సమానం. ఆ ప్రకారం నువ్వు నాకు చెల్లెలివి', అన్నాడు.

దేవయానికి కోపం వచ్చి:

'ఇలా నన్ను హింసించిన ఫలంగా ఈ విద్య నీకు ఉపయోగ పడదు పో' అంది.

'సోదరీ! విద్య ఎప్పుడూ నిరుపయోగం కాదమ్మా! ఈ మృత సంజీవని నీ శాపం ప్రకారం నాకు ఉపయోగపడక పోయినా నేను బోధిం చిన వారికి ఉపయోగపడుతుంది వెళ్ళు', అని దేవలోకం చేరాడు.

T.T.D. Religious Publications Series No. 354

Price : Rs. 10/-

## జ్ఞానసముద్రమైన మహాభారతం

కరుణ, ప్రేమ, అనురక్తి, మమత, ఆత్మీయత, భక్తి, ప్రపత్తి వంటి అద్భుత అనుభూతులను పొంగించేది కనుకనూ --

దైవత్వంలో మానవత్వాన్నీ, మానవత్వంలో దైవత్వాన్నీ దర్శించగల గొప్ప అనుభవం కలిగించేది కనుకనూ --

ఆత్మకు ఉద్దీపనం కలిగించే మహాభారత ఉపకథలకు ఆధునిక అక్షరరూపం కనుకనూ --

**ఇదుగో...............**

కథలంటే చెవికోసుకొనే పిల్లలకూ, యువతకూ "**భారతంలో నీతి కథలు**" ఇవే --

★ 'తెలివితో, వంచనతో కార్యాలు చక్కబెట్టుకొనే' కణిక నీతి ఆదిపర్వం లోంచి --

★ 'గర్వం ఎటువంటి ఆపదలు తెచ్చిపెడుతుందో' కణ్వమహర్షి చెప్పే ఉద్యోగ పర్వంలోని కథ --

★ 'అన్నదాన మహిమ గొప్పది' అని చెప్పే అశ్వమేధ పర్వంలోని కథ --

★ అరణ్యపర్వంలో మార్కండేయ మహాముని 'కులం కాదు గుణం ప్రధానం' అంటున్న కథ --

★ 'జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం' అనే నానుడిని తెలిపే అరణ్యపర్వంలోని కథ --

★ 'ధర్మపరులను ఎవరు పరాభవిస్తే వారినే ధర్మరక్షకుడు పరాభవిస్తాడని' అరణ్యపర్వంలోని కథ --

ఇలా ఎన్నో, ఎన్నెన్నో "భారతంలోని నీతి కథల"కు ఉషశ్రీ గారి ఆధునిక అక్షర రూపం.

...........**చదవండి.**

**Printed and Published by Sri K.V. RAMANACHARY, IAS, Executive Officer, Tirumala Tirupati Devasthanams, Tirupati**
**Printed at Gayathri Art Printers, Hyderabad.**
**Ph : 040-27670210, 98481 86697 on behalf of T.T.D.**